# బిల్హణీయము



[పండితులచే పరిష్కరింపఁబడినది.]



శ్రీ [illegible] & సన్సు,
సంస్కృతాంధ్ర బుక్‌డిపో,
స్థాపితం: 1882. రాజమండ్రి.

గ్రంథకర్త:

శ్రీరస్తు.

# బిల్హణీయము.

[పండితులచేఁ బరిష్కరింపఁబడినది.]

## చిత్రకవి సింగరార్య విరచితము.




వలవల శ్రీరాములు,

పబ్లిషర్ అండ్ బుక్ సెల్లర్.

రాజమండ్రి.

శ్రీరస్తు.

# బిల్హణీయము.



## ప్రథమాశ్వాసము.



శ్రీరామావనిజానిజాయతభుజా ♦ శృంగారశాఖామిళ
త్సారాకారలతా స్తనస్తబకభా ♦ స్వద్దంతవాసఃకిసా
లారాళాలకభృంగరంగదఖిలాం ♦ గాంచత్ప్రసూనోత్కర
శ్రీరామాకృతికల్పకంబు మము ర ♦ క్షించుఁ బుధానందమై.

క. భవసరసిజసంభవముఖ
భువనస్థ సమస్తదేవ ♦ ముఖ్యుల కెలమిం
బ్రివిమలమతి మ్రొక్కెద మ
త్కవితకు సంతతము సత్ప్ర ♦ కాశము కలుగన్.

క. ధర దోషోదకముల నిడి
గరిమఁ సుగుణామృతంబు ♦ గాంచు సుకీర్త్యా
కరవరమానసపదసం
చరసత్కవిహంసములను ♦ సంస్తుతి సేతుఁ.

తే. నిర్మలావయవమ్ముల ♦ నెమ్మివిడిచి
వ్రణములకుఁ బాఱు మక్షికా ♦ వ్రితతిభంగి
యొప్పులు గ్రహింపకెప్పుడుఁ ♦ దప్పు లరయు
కాకవులలోకముల నే ని ♦ రాకరింతు.

వ. అని యివ్విధంబున నిష్టదేవతా నమస్కరణంబును, సత్కవి పురస్కరణంబునుఁ గుకవితిరస్కరణంబునుం గావించి, యే నొక్కనాఁ డెక్కవయగ మక్కువం జొక్కి హృద్యవిద్యానవద్యులగు విద్వ

దాదులుఁ గొలువం గొలువుకూటంబున నధివసించి సముచితగతుల నతులనై ఖరి దీపించు నవసరంబున,

తే. చిత్రకవివంశదుగ్ధాబ్ధి ♦ శీతభానుఁ
డనుపమానోక్తి శ్రీసింగ ♦ రార్యసూనుఁ
డమితకవితావిశేషజ్ఞుఁ ♦ డనఁగ వెలయు
నారసింహార్యకవి వచ్చి ♦ నన్ను మెచ్చి

క. శ్రీపండిపెద్దిసత్కుల
దీపక, కాశ్యపసగోత్ర ♦ దివ్యన్నానా
భూపాలకమకుటమణీ
శ్రీపదపాదాగ్రభూమి ♦ కృష్ణస్వామీ!

సీ. కుత్సితకాణాద ♦ కుతర్కలకవిభేద
సంయుక్తయుక్తి వ ♦ జ్రపవిహార
యణకాంకపాణినీ ♦ యాటవీపాటన
చటులసూక్తివిహార ♦ పటుకుఠార
నిర్ణీతకృతజైమి ♦ నీయలోతూద్ధూత
సంస్ఫావాక్యజం ♦ ఝూసమీర
దుర్మతవేదాంత ♦ దుర్మదవిచ్ఛేద
భాసురవచనపవి ♦ భావసార

తే. కావ్యనాటకలసదలం ♦ కారచతుర
సాహితీమహాసన్నాహ ♦ సరసహృదయ
పండిపెద్దకులీన సం ♦ పన్నిధాన
పాలితకవీంద్ర శ్రీకృష్ణ ♦ పండితేంద్ర.

వ. అని వినుతించి, వినుము! భవదీయంబులగు చతుర్దశవిద్యాప్రభావంబులు, సకల భాషావిశేషంబులు, సమస్త చమత్క్రియావినోదంబులు, నెన్న నిన్నరులకుఁ దరంబుగాదు. నిఖిలలోకంబులఁ గృతిముఖంబుగాఁ గీర్తి నిత్యంబగునట్టి కృతులయంతు నాంధ్రం బతిరమ

ణీయంబు గావున, నొక్క పురాతనకథ సాంధ్రప్రబంధంబుగా రచియించి, రామాంకితంబు చేసి, యాచంద్రతారకంబగు సత్కీర్తిం గాంచి మనిన నేమను సంతోషాంతరంగుండనగుచు,

క. మున్నింద్రతనూభవునకు
వెన్నుండౌ సహాయమైన విధమున నే నా
సన్నుతసద్గుణగణసం
పన్నుం డాకవివరాధిప సహాయమునన్.

క. శ్రీజనకసుతహృదయముస
రోజాతస్వహస్తి కజవి రూపాక్షమరు
ద్రాజప్రముఖామర్త్యస
మాజాగ్రణి గరిజనాను మరుదసిఫణికిన్.

క. తుండీంద్రతుండనిభదో
ర్దండస్ఫుటకాండనిర్జిత మహోద్దండా
ఖండరిపుకాండునకున్
ఖండపరశుచండకార్ముక విఖండునకున్.

క. సుందరపదారవిందమ
రందము కెతబుధపురంద రమిళిందునకున్
కుందశరత్కందవృష
స్యందనచందనకనద్య శఃకందునకున్.

క. వరధీధిక్కృత చకాంగరథికి సౌందర్యహసిత కరథికి వినమ
చ్ఛరథీకృతశరథికి దా
శరథికి కృతశరధి కురగ శాత్రవరథికిన్.

క. హారితన ముహృదయసారస
హారిక మహాసూనృతజిత హారి శతితేజః

పరిహాసితహారికి భవగజ
హారికి సదాపాటపంక ♦ జాతవారికిన్

క. శాంతునకు దాసహృదయుని
శాంతునకు నితాంతనయన ♦ చాకోరయుగా
క్రాంతధరాజన్యకళా
కాంతున కానందభరిత ♦ కపికాంతునకున్.

క. రావణహరణునకు జితై
రావణచంక్రమణునకు ధ ♦ రారమణునకున్
భావనజనభరణునకున్
భావనయాభరణునకు న ♦ భంగరమణునకున్.

క. రామునకు నీలమేఘ
శ్యామునకు దివాకరాన్వ ♦ యాంభోధిసుధా
ధామునకుఁ బరశురామవి
రామునకు సమస్తభావ ♦ రలలామునకున్.

వ. అంకితంబుగా నాయొనర్పఁబూనిన బిల్హణోపాఖ్యానం బను మహా
ప్రబంధంబునకుఁ గథాక్రమం బెట్టిదనిన,

—♦ పురవర్ణన ♦—

తే. వసుమతికి నాభిభూతమై ♦ వఱలునట్టి
ధర్మశిఖరికి నుత్తర ♦ భాగమందు
ద్రుపదలలితంబు సుజనసం ♦ దోహచరిత
దివ్యదేశంబు పాంచాల ♦ దేశ మమరు.

వ. అందు,

శా. శ్రీరామామణి కాటపట్టు, హరికిన్ ♦ శృంగారవాసంబుఁ, జై
త్ర్యా రత్నంబులకెల్ల నాకరము, స ♦ మ్యగ్వాహినీపాలి కా
ధారం, బన్యదురాసదంబు, విబుధ ♦ ప్రాణంబు, రాజాప్తిచే
శ్రీరమ్యం బయి సింధురీతిఁ బురి ల ♦ క్ష్మీమందిరాఖ్యం దగున్.

క. ఆపురము జయశ్రీలకుఁ
గాఁపురము, సమంబు ద్వార • కాపురమునకున్
భూపురములలోఁ జెల్వగు
గోపురముఖచుంబితైక • గోపుర మగుచున్.

క. సతత శిరస్థలవిసరద
దితిసుతతటినీతుషార • దీప్రాబ్జములై
నుతికెక్కు సౌధరాజము
లతులిత శివమూర్తులనఁగ • నప్పురిలోనన్.

ఆ. కనకగోపురాగ్ర • ఘటిత గారుత్మత
రత్నరుచులు కుముద • రాజు లేడి
తొడరి మెసవఁజూచు • దూర్వాంకురములని
చను మృగేంద్రముఖము • లునికి నులికి.

సీ. ఒకచోట వనబోఁడు • లొకనీటు గొని మీటు
వీణలనాదంబు • వేడ్కసేయ
నొకచెంగట నభంగ • సకలాంగయుతమంగ
శమృదంగరవము ధిం • ధిమి యనంగ
నొకవంక గతశంక • సకలంక మృదువంక
జాస్యలు చెలఁగి లా • స్యములు సలుప
నొకచెంత వగకాంత • లొగి వింతఁ గొని సంత
సముమీఱ సరసగీ • తములఁ బాడ

తే. వెలయు బహువిధవాద్యసం • వేద్యహృద్య
ఘుమఘుమార్భటి దిక్కులఁ • గొమరు మిగుల
జనుల కానందరసము ని • చ్చలుఁ జెలంగ
రంజితావనిజాని యా • రాజధాని.

సీ. సురసాలసంతతి • సురసాలసంతతి
గతి ఖగాలికి ఫలో • న్నతి యొసంగు

మహితకాంచనములు ♦ మహితకాంచనముల
పోలిక నామోద ♦ ములు ఘటించు
కలితపున్నాగముల్ ♦ కలితపున్నాగము
లట్ల కొమ్మలతోడ ♦ నమరియుండు
రంభాదినటనముల్ ♦ రంభాదినటనము
కరణి మరుత్ప్రసం ♦ గములఁ బొదలు

తే. పనస లెంతయుఁ బనసల ♦ ఖ్యాతి ద్విజుల
కను బదక్రమసంయుక్తి ♦ కొమరుమీఱు
నగము లున్నతినగముల ♦ పగిది వనుల
నలరుచుండు పవిత్రంబు ♦ లగుచుఁ బురిని.

క. ఆవనములు ద్విజసందో
హావనము లతులితవృత్ర ♦ హావనములు స
త్పావనములు మార్గికసం
జీవనములు కలితభువన ♦ జీవనములగున్.

మ. కులసంరక్షణులున్, సువాక్సుమహితుల్ ♦ గోత్రాహితుల్, జాతవే
దులు, ధర్మాత్ములు. భాసురాఖ్యభువనా ♦ ప్తుల్, సజ్జగజ్జీవనుల్,
కలితార్థప్రదు, లూర్జితార్యులు, కన ♦ త్కాంతుల్,తమోదూరు,ల
య్యల ధాత్రీసురు లెంతయుఁ విబుధులై ♦యింపొందుటల్ చిత్రమే!

సీ. చక్రములకుఁ గీడు ♦ సలుపని రాజులు
దివిరి సత్తముల భే ♦ దింపని యిను
లిల కుభృత్తులకు వె ♦ న్నియని కూర్మిపతులు
గోత్రవర్గము బల్మిఁ ♦ గూల్పనిందు
లరికి మారోర్మము గా ♦ నట్టిపూరుషసింహు
లనయంబు మూలనుం ♦ డని మహేశు
లోకని దాపునఁ జేర ♦ నోపని శ్రీదులుఁ
బుణ్యంబు దప్పని ♦ పుణ్యజనులు

తే. నౌర ! వీరన వీరన ♦ యొకరతులు
పరగుదురు పురి శుచిభాను ♦ వంశు లగుటఁ
గువలయానందసంధాయి ♦ గురుతమోప
శాంతినై పుణ్యవిధులు రా ♦ జన్యవిధులు.

మ. ఒకశంఖంబునఁబొంగు సర్ధపతి యు ♦ ద్యోగంబు తాముఁన్ భజిం
పక రత్నాకరునితోడి సఖ్యమునకుం ♦ బాటించి సంఖ్యాధిక
ప్రకటార్థాఢ్యతచేఁ జెలంగి బహుళమి ♦ త్ర ప్రాభవాఖండరూ
ప కళా భూరివిభూతిఁ గాంతురు పురిన్ ♦ వైశ్యోత్తముల్ వేడుకన్.

క. హలపాణి యొక్కయేరుం
గలవాఁడని తెల్లజేసి ♦ కడువేడ్కఁ బురిం
గల విష్ణుపాదజావళి
యలరారె సువర్ణయుక్తి ♦ వ్యవసాయమునన్.

చ. సరసిజబాంధవుండు ముకు ♦ చాయ ననూరుఁడు తేరుదోల సు
స్థిరతరతన్నిబద్ధవర ♦ జిహ్మగపాశము లొలి వ్రేల న
ప్పురి కరు లబ్జనాళములె ♦ పో యని తుండము లెత్త దక్షిణో
త్తరముల నేగు భీతిమెయిఁ ♦ దజ్జగతీక్షణుఁడై రయంబునన్.

చ. వరుస నిజేశు మూలఁబడ ♦ వైచినయట్టి మరుత్తరంగముల్
సరిగొనకన్ జవంబు గొని ♦ సాగిన నాశుగమై సమీరుఁ డ
ర్భిరహీనరాఁ దదాకృతి హ ♦ రించెఁ బదోద్ధతధూళి కప్పి త
త్పురి తురగోత్తమంబులు వి ♦ భూషితసాదిబలోత్కరంబులై.

చ. సమములు గావు వాజు లని ♦ సారథి కుంటని గాలి కూడుప
గ్గములని చక్ర మొంటి దని ♦ గ్రాలు ననంతమణివ్రజప్రభా
వమహితమై ఘనావరణ ♦ వై ఖరితో నలరారురాజితో
త్తమరథరాజి భానునిర ♦ థంబు హసించు సదా సముద్గతిన్.

క. కట్టింతురు రుద్రునయిన,
దట్టింతురు హరులనైనఁ ♦ దలఁగని కడిమిం

గొట్టింతురు యమునైనను,
బట్టింతురు రిపులనెల్ల • భటు లప్పురిలోన్.

సీ. తమ్ములదోషాప్తిఁ • గ్రమ్మిమూసినఁబట్టు
నయశాలులను బొట్టొ • నర్చుకొఱఁత
ధాత్రిమహాహను • దండసిల్పినపడి
కలసదావర్తుల • గార్చునగడు
భోగి నధోగతిఁ • బొందించు పాతకం
బాదిత్యకపుల మే • లడఁచుకొదవ
కడుఁ గళానిధిఁ దమో • గ్రస్తుఁ జేసినదూఱు
ఘనులవివర్ణతఁ • గలవు కలఁక

తే. నలువ తప్పించుకొనియెఁ ద • న్నగరిసతుల
యలరుపదములు, మృదుజంఘ • లరిదిపిఱుదు,
లలఘునాభులు, మెఱుఁగారు • వలుదకుచము,
లపురు మోములు, వరకుంత • లము లమర్చి.

ఉ. కాంచన పద్మరాగ శశి • కాంతమణీగణకల్పితోజ్జ్వలో
దంచిత సౌధరాజములు • తత్పురి నొప్పు ధ్వజాన్వితంబులై
మించినభీతి పత్త్రియుత • మేరుముఖాచలపంక్తులెంతొ నే
తెంచె ననంగ భూతినము • తేంద్రుఁడుగాన ధరేంద్రుపాలికిన్.

— పుష్పలావికావర్ణన —

సీ. నెత్తమ్మిదేకొంతు • నీ విక వదలించు
సేవిక వదలక • నేవిధంబు
నీకుల్కు చెండ్లేవి • పైకమ్మ దప్పించు
పైకమ్మఁ దప్పనే • చేకొనంగ
నెంత నీకై దండ • నిచ్చెనటే మేలు
కై దండ యిత్తురే • కర మెడలక

భావింప రుచియేమొ • బంధుజీవం బేది
యీబంధుజీవనం • బెంతుగలుగు

తే. ననుచు వీనుల సరస న • ర్మానుకూల
వచనరచనల మెలఁగుచు • వరలు విటుల
కనుగుణంబులఁ బలుకుచు • ననుదినంబు
వెలయుదురు వీటఁ బుష్పలా • వికలు బ్రీతి.

వ. మఱియు నప్పట్టణంబు మణిఘటిత కాంచన ఘనావరణంబులును, ఘనావరణ నివారణ పటు పటాంచల లానిల కేతనాంచిత సౌధ రాజంబులును, సౌధోపరి నిబద్ధ ముక్తామయ శిరోగృహంబులును, గృహరాజిత మణి కవాటంబులును, కవాట విరచిత మరకత మణి శోభా విరాజమాన తోరణప్రకాశిత ద్వారంబులును, ద్వారోభయ పార్శ్వ రమ్య రత్న వేదికలును, వేదికాంతర రచిత విద్రుమంబులును, విద్రుమ వైడూర్య స్తంభ సముదయంబులును, స్తంభ సంభృత శాత కుంభ కుంభ విలసిత మంటపంబులును, మంటపాభ్యంతర సంచర త్సుందరీజనంబులును, జనసందోహ సంపూరిత వీథికారాజంబులును, రాజకుమారారూఢ సంచర ద్గంధ సింధుర సైంధవ రథనికరంబులును, కరవిన్యస్త వీణావాదన ప్రవీణగాయకులును, గాయకయుక్త మృదంగ తాళాది లాస్య సంరంభ విజృంభమాణ రంభా సమాన వారకాంతలును, గాంతనిరంతర సురభికుసుమ ఫల భరితోద్యానంబులును, నుద్యానాంతర కనత్కమల కల్హార మరంద పాన తుందిల మిళింద ఝంకార ప్రమోద మేదుర సారస హంస చక్రాది జలవిహంగకలిత సరస్సులును, సరసమనోహర పరిమళ మిళిత శీతల పవమానంబులునుంగలిగి, యమరావతీవిధంబున విబుధ గణ విభ్రాజమానంబై, తేజోవతీ నగరంబు చందంబున లోహితాశ్వ విలసితంబై, సంయమనీ నగరంబు పోలుపున సమవర్తి ధర్మరాజ విరాజితంబై, నైఋతినిలయంబుకై వడి పుణ్యజనోద్దీపితంబై,

వరుణమందిరంబురీతి ఘనపుష్పమాలికా శోభితంబై, పవనుని గేహంబుభాతి నానా సుగంధ బంధురంబై, యలకాపురంబుపగిది ధననిధి మహితంబై, కైలాసంబులాగున రాజశేఖర రమ్యంబై, కమలగర్భు సదనంబుపోలిక మహిత భాషా సమన్వితంబై, హరి నివాసంబుచాడ్పున నిత్య ముక్తాభిగమ్యంబై, భోగవతీపుటభేదనంబు తీరున మహాభోగి భాసురంబై, వాహినీపతి తెఱంగున శరణాగత భూభృజ్జాలంబై, నాకేతరాజధాని వడువున రామ లక్ష్మణోప శోభితంబై, ద్వారకయందంబున గృష్ణ బలభద్ర ప్రకాశంబై, హస్తిపురీ వైఖరి గాంగేయాది పూజితంబై, యింద్రప్రస్థపురంబుమాడ్కి- యను గతధర్మజాతంబై, వారణాసిచమాడ్కిం బ్రచండకాలభైరవ శూల హస్తగక్షితంబై, సిరుల నిరవొందుచుండు.

క. ఆజగతి కధీశ్వరుఁడై,
రాజిలు మదనాభిరామ, రాజేంద్రుఁడు జ
న్యాజితాబాహాపనిధా
రాజిత సముదోన్నతారి, రాడ్గోత్రుండై.

సీ. రమణ లక్ష్మిమంది, రమ్మమేలమ్ముగా
గను సదాళిగుణమ్ము, గా గ్రహించి
మధురధర్మముఁ బూని, మాధవు లోఁగొని
యలఘు ద్విజావళి, నాదరించి
దాక్షిణ్యశాలి నో, ద్దనె నిల్పికొని కళా
నిధిపర్వమున రుచుల్, నిండఁజేసి
శోభితంబుగ మహా, సుకృతి భావముఁ గాంచి
వరసత్యరతిమనో, హరతమింశి

తే. కలనయం దుగ్రమూర్తి సం, కల్పమడఁచి
ఘన సదృక్పాలికా మాన, కర్తయగుచు
నతను విఖ్యాతిచే మద, నాభిరాముఁ,
డలరు నిజనామగరిమ య, థార్థముగను.

సీ. బిసములోపలఁజిక్కి ♦ వెతలువాని స్వయంబు
లాలిత వాణీవి ♦ లాసుఁ జేసె
నొంటివాఁడై దాస ♦ మొరుని వేఁడిన చిరం
తనమౌని మేటిభూ ♦ ధవునిఁ జేసె
నచలాధివాసుని ♦ నాదిభిక్షుని సర్వ
మంగలానుభవసం ♦ ప్రాప్తుఁజేసె
బహుళార్తిభేదవి ♦ భ్రాంతి గుందకళంకిఁ
దనతోడఁగూడ న ♦ త్పతినిఁ జేసె
తే. నెన్న నీగుణ మీధర్మ ♦ మెందుఁగలదె,
తగ నయుక్తుల సరియుక్త ♦ లుగ నొనర్చు
నితని మదనాభిరామాఖ్య ♦ మిడిన నలువ
కౌశలంబు గణింప శ ♦ క్యంబె చూడ?
తే. రమ్యగుణశాలి యాభూపు ♦ రందరుంచు
దారగాఁగొని లీలమం ♦ దారమాల
ననుదినంబుఁగూడి క్రీడల ♦ నతిశయిల్లి
యువనిఁ బాలించె బుధనికా ♦ యంబు వొగడ.
క. ఆయనఘున కుదయించె మ
హాయతగుణజాల బాల ♦ యంచితలీలం
దోయజసాయకు నాజ్ఞవ
సాయక మన భూజనాళి ♦ సన్నుతిసేయన్.
తే. చాయలనుఁ జెల్వమైన లేఁ ♦ బ్రాయమునను
జనుల కల్లారుముద్దుగా ♦ ననువుపడుచు
నాట పాటలు సలుపుచు ♦ నవని బాల
యామినీపూర్ణతిలక న ♦ మాఖ్య నలరు.
వ. ఆకుమారీరత్నంబు దినదినప్రవర్ధమానయై యున్నయెడ.

క. మృగమదమున రుచి బుట్టిన
పగిదిని, జెఱకునను బండు ♦ బండినరీతిన్
దగ సురభి పసిఁడి నొదవిన
పగటున, యౌవనము దనరు ♦ బాలామణికిన్.

సీ. మహిత యౌవనరూప ♦ మధు మధురాలాప
బింబోష్ఠి శ్రీవర్ణ ♦ బింబకర్ణ
కంజాతదళనేత్ర ♦ కాంచన నిభగాత్ర
చతుర చంపకనాస ♦ చారుహాస
పటుసైకతశ్రోణి ♦ పల్లవాంచిత పాణి
ప్రౌఢ సౌభాగ్యసం ♦ పన్న యోగ్య
కరికుంభ కుచపాళి ♦ ఘన నీల రోమాళి
యబ్జారి వదన కుం ♦ దాళిరదన

తే. యలరు మరువంపుమొలక, కా ♦ యజుని చిలుక,
కలితకర్పూరతిలక, సు ♦ గంధఫలక,
యామినీపూర్ణతిలక నీ ♦ లాంచతలక
రాజసముగుల్క శృంగార ♦ రసముఁజిల్క.

సీ. నలినాక్షి కొప్పు కృ ♦ ష్ణత్వంబుఁ బ్రాపించు
నెమ్మోము విభురీతి ♦ నివ్వటిల్లు
నబ్జాస్యకన్ను ల ♦ బ్జాక్షతవహించు
నధరంబు మాధవ ♦ ఖ్యాతి నమరు
వలివేణి చనుదోయి ♦ యచ్యుతత్వముఁగాంచుఁ
జెయ్యి పద్మాహిత ♦ స్థితి భజించుఁ
గరియాన నూగారు ♦ హరిలీల భరియించుఁ
గౌననంతవిభూతి ♦ గరిమఁదాల్చు

తే. నాభి పురుషోత్తమాకృతిఁ ♦ బ్రాభవిల్లు
దనువు హేమాంశుకస్ఫూర్తిఁ ♦ దనరు, నిట్లు

భామ యవయవగతి విష్ణు ♦ భావమొంది
వెలయుచుండు జనావళి ♦ వినుతిసేయ.

వ. ఇట్లు తల్లిదండ్రుల కల్లారుముద్దుగా ముద్దియ యేప్రొద్దుఁ బ్రొద్దులఁ బుచ్చు నవసరంబున,

— ♦ విద్యాభ్యాసము ♦ —

తే. అక్షరాభ్యాస మొనరింప ♦ ననువుపడుచు
స్వరయుతంబుగ వీణాది ♦ వాదనములు
చెలఁగు గీతప్రబోధవి ♦ శేషకలన
గానమైపుణి నేర్చె సల ♦ స్కారయుక్తి.

సీ. రమణీయతరమైన ♦ రాయంచ మృదుచర
ణాబ్జ సంగతినా ♦ ట్యములు సలుప
జెలువమై ముద్దులు ♦ గులుకు వల్కులతోడఁ
బెంపుడు రాచిల్క ♦ పేరుఁ గొనఁగ
రామాయణాది స ♦ ద్గ్రంథముల్ వెలయఁగా
బద్యపుస్తకరాజి ♦ వరిఢవిల్లఁ
దాళకాలక్రియో ♦ ద్ఘాతతంత్రీస్వర
భేదంబులను బాణి ♦ వీణమెఱయఁ

తే. జెలఁగు చిఱునవ్వు వెన్నెలల్ ♦ చిలుకుచుండ
గలికి తెలిడాలు చూపులు ♦ గలయఁబర్వ
బాండిమము దోచి భారతి ♦ జాతినాతి
పసిఁడిగద్దియపైఁ బాట ♦ బాడుచుండె.

క. ఆపాట నవసుధాలహ
రీపటల మనోజ్ఞమాధు ♦ రీలలితంబై
కోపై వీనులకాపై,
యాపైకరవందుమాడ్కి ♦ నాపైఁ దోఁచెన్.

వ. అట్టి సమయంబున,

క. మదనాభిరామభూపతి,
రొదవిన సంతోషమున మ ♦ హోల్లాసముతోఁ
బొదలుచు గానము సేయఁగ
మదవతి నిజపుత్రిఁ జూచి ♦ మదిఁజింతించెన్.

తే. ఈకులపవిత్ర సురుచిర ♦ హేమగాత్ర
చంద్రకళగద సంగీత ♦ జలధి కిపుడు,
దీనికిని సర్వవిద్యలుఁ ♦ దేటపడఁగఁ,
జేర్చి సాహిత్య మొదవఁ జే ♦ ప్పింతు ననుచు.

వ. నిశ్చయించి,

తే. కొలువుకూటంబునకు వచ్చి ♦ కువలయేశుఁ
డమరసింహాసనాసీనుఁ ♦ డై ప్రధానుఁ
డగు వసంతాఖ్యు రావించి ♦ యధిక సంభ్ర
మమున మన్నించి పలికె స ♦ మ్మతి దలిర్ప.

క. ఓమంత్రిశిఖామణి ! యిదె
నాముద్దుల కూర్మితనయ ♦ నయ మలరంగాఁ
గోమనగతి లయపద్ధతు
లేమారక సరసగాన ♦ మింపుగ నేర్చెన్.

తే. గానవిద్యకుఁ దగినట్లు ♦ కన్య కిపుడు
కావ్యనాటకసదలం ♦ కారభావ
సరససాహిత్య మేర్పడు ♦ సరణిఁ గఱపి
ప్రౌఢ గావింపవలయు ని ♦ రూఢమతిని.

వ. అనుచున్న సమయంబున సభాసదులు తమలో నిట్లనుకొనిరి.

తే. కలికిపాలిండ్లు మేలిబం ♦ గారుగిండ్లు
చానవాల్జూపు లానుమ ♦ చాపుతూపు
లతివవదనంబు సదనంబు ♦ యబ్ధిసుతకు
కాంతముంగురు లమ్మధు ♦ కరుల కురులు.

ఉ. మోహమఖిలంబుఁ గన్నఁగవ ♦ ముచ్చటమీఱఁగ వక్షమంతయున్
గామిడి చన్నుదోయి, కను ♦ గౌను సమస్తము మిన్నుచూడఁగా
హేమను తత్తనూవిభవ ♦ మీరుచిరాంగికి విద్య చెప్పఁగా
నీమహి నెవ్వఁడోపు స్మరి ♦ యించినమాత్రనె భ్రాంతిపుట్టఁగన్.

వ. అనిన విని వసంతుండు భూకాంతున కిట్లనియె.

క. ఓరాజ! సకలశాస్త్రవి
శారదు లీపురమునందుఁ ♦ జాలఁగలా ర
వ్వారి నిటకు రావించి వి
చారింపఁగ వలయు విద్య ♦ చదివింపంగన్.

చ. అన విని సర్వశాస్త్రముల ♦ యందు విశారదులైన యార్యులన్
ఘనమతిఁ బిల్వఁబంచి, నయ ♦ గౌరవము ల్పచరించి వారలన్
గనుఁగొని పల్కె భూవిభుఁ డ ♦ నంతగుణోన్నతులార! మీర లుం
డినఫలమేమి? యొక్కటి ఘ ♦ టింపుఁడు మాకన, వార లత్తఱిన్.

సీ. తర్కశాస్త్రములందుఁ ♦ దత్కల్పనలయందు
భాషింపఁగను మహా ♦ భాష్యమందు
శబ్దశాస్త్రములందు ♦ సకల తత్త్వములందు
శ్రుత్యంతములయందు ♦ శ్రుతులయందుఁ
దత్పదక్రమజటాం ♦ తముల నారోహావ
రోహములఁ బురాణ ♦ రూఢియందు
స్మృతివిషయమ్ములఁ ♦ జెలఁగు మతగ్రంథ
ములయం దితరశాస్త్ర ♦ ములను మఱియు

తే. ఘనులమై వాదములు, ప్రసంగ ♦ ములు చేసి
గెలిచియున్నట్టి మము ప్రసం ♦ గించి యెవఁడు
గెలుచు, మావంటివార లే ♦ కలను గలరు?
రాజ్యరఘుపతి, మదనాభి ♦ రామనృపతి!

చ. అవ్వని వారి కిట్లనియె ♦ నాత్మముదంబున భూమిపాలుఁ డో
ఘనమతులార ! మీర లిటఁ ♦ గాళల మేర్పడఁ గావ్యనాటకా
భినయకవిత్వచాతురిత ♦ పెంపక్షిలంబుఁ గనంగఁజేయుఁ డీ
మనసిజరాజపుత్రికిని ♦ మద్వరపుత్రికి మంజుగాత్రికిన్.

వ. అనిన విని యార్యవర్యు లారాజవర్యున కిట్లనిరి.

క. మేము రసజ్ఞుల మధిపా
కామయ్యా ! రసజ్ఞు లనఁగఁ ♦ గవివరులేకా
దా, మాకుఁ గవిత్వములే,
దీమహి ఛాందసులఁ బొందునే ♦ యది తలపన్ ?

వ. అది యెట్లంటేని.

సీ. శబ్దాపశబ్ద వి ♦ చారి యైనట్టి వ్యా
కరణజ్ఞు జనకునిఁ ♦ గాఁ దలంచు,
యుక్తివాదములచే ♦ నొప్పారు తార్కికు
భ్రాతగా బుద్ధి నే ♦ ర్పడఁ దలంచు,
చతురుఁడౌ మీమాంస ♦ శాస్త్రపారీణునిఁ
గదియఁగ షండునిఁ ♦ గాఁ దలంచు,
నొదిగి వైదికనిష్ఠ ♦ నుండు నధ్యాపకుఁ
గనలి చండాలునిఁ ♦ గాఁ దలంచు

తే. వివిధముగ నిట్టు లధిప ! క ♦ విత్వకన్య
కావ్య నాటక లసదలం ♦ కారభావ
నవరసాభిజ్ఞు మది నిజ ♦ నాయకునిఁగఁ-
దలఁచి వరియించుఁ దనుఁద్రాన ♦ వలపుమించి.

వ. అని పలికిన విబుధేంద్రులకు రాజమహేంద్రుం డిట్లనియె.

క. వరనాటకకావ్యజ్ఞుఁడు,
సరసుఁ, డలంకారవేది ♦ ఛందోనిపుణుం,
డురుసాహిత్యకళానిధి,
యరయఁగ నెవ్వఁడు వచింపుఁ ♦ డతనిం దెలియన్.

తే. అనిన మల్హణ బిల్హణు • లనఁగఁ గవులు,
సరసు లిరువు రలంకార • సహితు, లందు
బిల్హణుం డనువాఁడు గం • భీరుఁ డధిక
తముఁడు, కవితా జనంగ స్తో • త్రములు వడసె.

— బిల్హణకవిని వర్ణించుట. —

శా. ఆవాచాలత, యాకవిత్వసరసం, • బా ప్రౌఢి, యారూఢి యా
భావం, బాపదశబ్దగౌరవము, లా • పాండిత్య, మాశాస్త్రబో
ధావిర్భావక, మాసుధారసవచో • వ్యాపార, మాప్రజ్ఞ యం
దేవిద్వద్భులభేదికైనఁ గలదే • యెంతేనిఁ జింతింపఁగన్ ?

సీ. ధరణి వస్త్రములలో • ధవళాంబరము మేలు,
ఋతువులలో సుమా • న్వితము మేలు,
సుమములలో శిర • శ్చోభి మల్లిక మేలు
విలుకాండ్రలో రతి • విభుఁడు మేలు,
ఘనసౌరభములలోఁ • గస్తూరి మేలగుఁ,
గలయస్త్రములఁ గార్ము • కంబు మేలు,
తనరు వాక్కులలోనఁ • దర్కవాక్యము మేలు,
సారసముఖులలో • శ్యామ మేలు,
తే. పరగు పదవులలో విష్ణు • పదవి మేలు,
దశలయందున యౌవన • దశయు మేలు,
మహితగీతులలోఁ బంచ • మయు మేలు,
కవులలో నెల్ల బిల్హణ • కవియ మేలు.

చ. మృగములలోన సింహ, మవ • నీంద్రులలో రఘురామమూర్తి, ప
న్నగములలోన శేషుఁడు, వ • నమ్ములలోపల నందనమ్ము, దే
వగణములోన శంకరుఁడు, • వార్ధులలోనఁ బయోబ్ధి యెట్లనో
మిగులఁ గవీంద్రసంతతిని • మేటియె బిల్హణుఁ డెట్లు చూచినన్.

వ. అనిన విని వారల బహూకరించి యథాస్థానంబుల కనిచి మంత్రివరు నితో నిట్లనియె.

—: రాజు బిల్హణకవిని బిలిపించుట. :—

ఉ. ఆకవిరాజరాజమణి నాదర మొప్పఁగఁ బిల్వఁబంపు మ
య్యా! కవితాచమత్కృతి వి హారముఁ జూతము, మత్కుమారి క
స్తోకముగాఁ గవిత్వవిధిఁ జొప్పడఁ జేయుద మంచుఁ బల్కఁగా,
నాకడ మంత్రి సజ్జనుల నంచిన, వా రటుఁబోయి యచ్చటన్.

సీ. ఒకచెంత వేదాంత మూహించి ప్రకటించు,
నొకయోర మణిసార మొగి వచించు,
నొకచోట వరనాట కకలాపము రచించు,
నొకచక్కి ఘనఫక్కి కోక్తిఁ దెలుపు
నొకయోర శృంగార యుతకావ్యములఁ జూపు,
నొకసీమ నురుసామ మూని పలుకు,
నొకదండ స్వరమండ లకలగానముఁ బేర్చు,
నొకక్రేవ బహుభావ యుక్తి నెఱపు,

తే. నొక్కతలమున మీమాంస మొక్కదారి
వ్యాకరణపాఠ, మొకదెస నలఘులక్ష
ణాద్యలంకారములఁ గోర్కు లమర నొసఁగు,
నట్టిబిల్హణుఁ గాంచిరి హర్ష మొదవ.

వ. కాంచి, దండప్రణామంబు లాచరించి దీవనలు గైకొని సముచితాసనంబులం గూర్చుండి కవిరాజశేఖరు నుద్దేశించి.

శా. దేవా! బిల్హణపండితేంద్ర! విను, మ ర్థివ్రాతకల్పద్రుమో
ద్భావుం డామదనాభిరామనృపుఁ డ త్యంతానురక్తిం బ్రతీ
తోవాంఛన్ మిముఁ దోడితెమ్మనుచు నా జ్ఞాపించె, విచ్చేయుఁడీ
యీవేళం బనియుంచుఁ బల్క, ననియెన్ హేలాగతిన్ వారితోన్.

ఉ. ఏమి ప్రయోజనంబు? మము నేటికిఁ బిల్వఁగ మిమ్ముఁ బంచె నా
భూమివిభుం డుదాత్తమతి? భూరిగుణోన్నతులార! తెల్పుఁడీ!

మేమం కేగుదెంచెదము, మీరు రన నేమిప్రయోజనంబొ, మా
కేమి పెఱుంగవచ్చు? మహా నీయులు పూజ్యులుగారె పండితుల్.

—బిల్హణుండు రాజసభకు వెడలి వచ్చుట—

వ. అని శిష్యులనుఁ బ్రబోధాయమానాంతరంగుండై కవిపుంగవుం డమిత
శిష్యసంఘంబుఁ గొలువ రాజమార్గంబున వచ్చునెడ.

ఉ. అమలసత్కళావిభవ, మాకనుబొమ్మల చందము, మావయో
ధామములోన, మానయన తామరసాతివిశాలదీర్ఘ రే
ఖామహిమాత్రశ్రుతిద్వయ వికస్వరకుండలదీపగండపా
ళీమధురస్మితప్రభలు లేములు సూచి రుదంచితోన్నతిన్.

తే. చూచి, తలయూఁచి, తత్తనూ రోచి కాచి
తీమహిమ కాత్మ మెచ్చి యెం తేని సూన
బాణుశరాణవిభిన్న సం భ్రాంతచిత్తు
లగుచు నేకాంతమునఁ గాంత లతిశయమున.

ఉ. ఎవ్వఁడొ వీఁడు, చక్కఁదన మే మన, నెన్నఁడుఁజూడ, మెవ్వఁడో?
పువ్విలుకాఁడొ యాధనదుపుత్రుఁడొ చంద్రుఁడొ యాజయంతుఁడో?
యువ్వనశిరోమణుల హృద్వనముల్ చిగురింపఁజేయఁగా
జవ్వని! యేగుదెంచిన వసంతుఁడొ చూడఁగ నాకు నావుడున్.

మ. అతివా! పువ్విలుకాఁడనం బలికె దీ వజ్రాశుగం బెద్ది? యం
చితమౌ యిక్షుశరాస మెద్ది? మఱియుం జూతింప నవ్వారి ల
క్షిత తత్తచ్ఛుభలాంఛనంబు లుపల క్షీభూతముల్ గావు నా
మతి నూహింపఁగ వచ్చెనో హరి తగన్ మానుష్యరూపంబునన్.

సీ. రాకాశశాంకుశోభి రాజబింబ మటంచు
వినుతిసేయఁగఁబోలు వీనిమోము
ప్రతమాసవికసిత బ్జాతపత్రము లంచు
నెన్నంగఁదగు వీని కన్నుదోయి
శ్రీకువలయపతి హేమ సింహాసనం బంచు
వీక్షింపఁగా నగు వీనియురము

ప్రోన్నమితస్ఫుటో ♦ ద్యక్షాహిపతి యంచుఁ
బలుకవచ్చును వీని ♦ బాహుయుగము

తే. తుంటవిల్కాఁడు ముక్కంటి ♦ కంటిమంట
నంటినను జెడి మును దమ్మి ♦ కంటికరుణ
మగుడఁ బడమికి దిగియెనో ♦ తగ నతఁడు,
సకియ! కాకున్నఁ గలదె యీ ♦ చక్కఁదనము?

సీ. ఈపురుషోత్తము ♦ నెద వసించిన పద్మ
కరభాగ్య మేమందు ♦ కమలనయన?
యీచతురాస్యోక్తి ♦ నెలమిఁ గాంచిన శుభ
వాణి ప్రౌఢిమఁ జెప్ప ♦ వశమె తరుణి?
యీమేటిసర్వజ్ఞు ♦ నెనసియుండిన సతి
భూతి యింతింతనఁ ♦ బొసఁగదబల?
యీభామనిఁగూడి ♦ యింపొందు సుచ్ఛాయ
పదవి యెంతనిచూతుఁ ♦ బద్మగంధి!

తే. వినవె, యీవనితానవ ♦ మనసిజాతు
గూడి క్రీడించు తరుణుల ♦ కోర్కులెల్ల
సఫల, వీనిసంగతి ♦ నలుపనట్టి
వెలఁదిజన్మంబు ధారుణి ♦ వృథయెకాద?

వ. అనియిట్లు వర్ణిపుచుండ బిల్హణుండు నిజాననసుధాకరప్రభాజాలమ్ములఁ దత్రత్యజనవిలోకనసందోహమ్మున చకోరికాబృందమ్ములుగాఁగ మత్తేభంబుచాడ్పున మందగమనంబున వచ్చి, విద్వజ్జనమంత్రిపురోహితామాత్యభృత్యవర్గంబుతోఁ దగురాజేంద్రువలనఁ బ్రత్యుత్థానాభివందనంబులు గైకొని సముచితాసనంబున నధివసించి యాశీర్వాదపూర్వకంబుగా వేదవేదాంతాది శాస్త్రంబు లుపన్యసించి, ఫలసహితంబుగా మంత్రాక్షత లొసంగి మఱియును,

క. కవితాప్రసంగ మొంతయు
నవిరళముగఁ గొంత చేసి ♦ యచ్చట విద్వ
త్కవివరులచేత మెప్పులు
నవనీపతి హర్ష మొదవ ♦ నందెను వేడ్కన్.

క. గురుకవిభాషితయుతమై,
సురరాజసభాస్థలంబు ♦ చూడ్కిని దద్భూ
వరునిసభాస్థలి విబుధా
కరమై, వరమై, ప్రమోద ♦ కరమై యొప్పెన్.

వ. అప్పుడు.

తే. రాజరాజైన మదనాభి ♦ రాముఁ డలరి
తనదు కంఠస్థహారాళిఁ ♦ దగనొసంగి
మఱియు మణిరుచిరాంబర ♦ మహితభూష
ణావళు లొసంగి విడిదికి ♦ ననిపెఁ గవిని.

వ. అందు మిత్రజనపరివృతుండై భూవరుండు మంత్రివరునితో నిట్లనియె.

చ. మరుఁడు తనూవిలాసమున, ♦ మంజుతరోక్తివిశేషయుక్తిచా
తురిమ గురుండు, సత్కళలఁ ♦ దోయజవైరి తలంప, వీనిఁ దా
మరసదళేక్షణ ల్గనిన ♦ మారశరాహతిఁ గ్రాగుచుందు రీ
వరకవియొద్ద మత్సుతకు ♦ వాంఛితవిద్య లభించు టెట్లొకో.

తే. వినుము, సుగతికి వరకల్ప ♦ వృక్ష మితఁడు,
వీనిలావణ్య మనిమొడు ♦ విరులగుత్తిఁ
దనరు తారుణ్యవతుల చి ♦ త్తంబు లనెడు
మధుపముల రేఁచి దిగుచు న ♦ మ్మతిఁ దలిర్ప.

సీ. వీని మనోహరా ♦ నూనభావముఁ గాంచి
మే నెఱుంగకపోవు ♦ నూనశరుఁడు
వీని భాసురకళా ♦ విర్భూతిఁ గనుఁగొని
మిన్నందు నెపుడు త ♦ మీవిభుండు

వీనిసౌందర్యాతి ♦ శభసంబుఁ బరికించి
యనిమిషగతిఁ జూచు ♦ హరిసుతుండు
వీనిసౌభాగ్యశో ♦ భితవృత్తిఁ గని యుత్త
రాసఁ జెలంగు వి ♦ త్తేశసూనుఁ

తే. డవుర ! వీనికి దీటైన ♦ యతఁడు గలఁడె
వసుధ వీక్షింప దేవతా ♦ వనితలైనఁ
దొడరి మూర్ఛానుగతిఁజెందు ♦ దురు, మనుష్య
కాంత లన నెంత యీతనిఁ ♦ గాంచినంత ?

వ. అని,

క. ఈవిధమునఁ బల్కినపతి
కావిబుధేంద్రుఁడు సుమంత్రి ♦ యనియెన్, నృపవ
ర్యా ! విద్యాభ్యాసము చెలి
కేవిధమునఁ బట్టుఁబడు గ ♦ వీంద్రుఁడు లేమిన్ ?

క. ఇతఁడు వినాగా నెవఁ డీ
క్షితితలమునఁ గవివరుండు ♦ సెప్పుమా ? యనినన్,
మతిమంతుఁడ ! యీవిధమున
కతి చతురోపాయ మొకటి ♦ యాత్మఁ దలఁపుమా.

వ. అని నృపాలుండు పల్కిన మంత్రి యిట్లనియె.

క. దేవరవారికిఁ దెలియని
దీవిశ్వమునందుఁ గలదె ♦ యిప్పు డటులైనన్
నే వచియించెద వినుమీ
దేవ ! భవత్కారుణచేత ♦ దెలిసినయంతన్.

మ. ఒకచిత్రవ్రతమున్న దిద్దరకు రా ♦ జోత్తంస ! సిద్ధంబుగా
సకలంకాకృతియైన నీతనయ జా ♦ త్యంధు న్విలోకింప దా
సుకవీంద్రుండును గుష్ఠగాత్రి నెపుడుం ♦ జూడన్ మదిం గోరఁ డిం
దుకు నేనావచియించు లే యెఱిఁగి యిం ♦ దున్మన్నదకార్యమున్

వ. అని మఱియు నిట్లనియె.

మ. కవిరాజాగ్రణి పుట్టుగ్రుడ్డనుచు నీ కంజాక్షికిం జెప్పి, యా
కవికిన్ మీనుత కుష్ఠగాత్రి యని వే ♦ డ్కందెల్పి, యవ్వారికిన్
భువి నన్యోన్యవిలోకనక్రియలు నే ♦ ర్పున్ మీఱఁ గాకుండున
ట్లు విచారించెద నొక్కయుక్తి వినుఁ డీ ♦ ట్లున్ రాజదేవర్షభా!

క. ఇరువురకు నడుమ నొక తెరఁ
దిరముగఁ గట్టించి చదువు ♦ దృఢతరమతిఁ జొ
ప్పరయఁగ మనకన్యక నే
మరకను జదివింతమయ్య ♦ మనుజాధీశా!

వ. అనిన విని సంతోషితస్వాంతుండై భూకాంతుండు.

క. ఓమంత్రి! యెంతవాఁడవు
నీమహిమ నుతింపఁదరమే ♦ నిర్మలగుణ! నీ
వేమంటి, వేమి చెప్పితి,
వామాటలయట్ల సేత ♦ మది మేలుగదా.

వ. అని యంతఃపురంబుఁ బ్రవేశించి.

చ. జలరుహపాణి, వారిధర ♦ చారుమనోహరవేణిఁ, గాంచనో
జ్జ్వలరుచిగాత్రి, నీలజల ♦ జాతదళాయతనేత్ర, నంతిక
స్థలమున నున్నదాని, సుమ ♦ సాయకుమారునిఁ బోలు నాత్మజన్
నెలకొని కాంచి ముద్దుఁగొని ♦ నెమ్మి దలిర్పఁగఁ దండ్రియిట్లనున్.

— రాజు తనకుమార్తెతో బిల్హణుం డంధుండని చెప్పుట. —

క. నాగర్భజలధిరత్నమ!
నీగారాబంబుఁజూడ ♦ నీకెప్పుడు నే
రాగంబున సాహిత్యము
బాగుగఁ జెప్పింతునమ్మ ♦ ప్రౌఢిమ మెఱయన్.

క. సంగీతవారిధికి సా
రంగధ్వజరేఖ వగుచు ♦ రాజితకవితా

సంగతి లేక చెలంగుట
భంగంబుగదా తలంప ♦ భావములోనన్.

క. సంగీతవిద్య కెలమిన్
సంగతి సాహిత్యవిద్య ♦ సరిగా రెండున్
మంగళవతి కలిగిన నా
సంగతిఁ జెప్పంగఁ దరమె ♦ సంగీతనిధీ!

క. మనపట్టణమున విద్యా
భినయజ్ఞుఁడు గలఁ డొకండు ♦ బిల్హణ సంజ్ఞం
డనఁగను జాత్యంధుం డా
తనిచెంగటఁ జదువవలయుఁ ♦ దత్పరమతివై.

వ. అనిన విని.

ఆ. అయ్య! నేను చూడ ♦ నాకవియొద్దను
జదువు లెల్ల నెటులఁ ♦ జదువుకొందు?
నంధకాననంబు ♦ నాలోకనమ్మునేయ
నవ్రతంబు నాకు ♦ జనక కలదు.

క. అంధకునిఁ, బాండురోగిని
బాంధవదూషకుని, షండుఁ, ♦ బాపాత్ముని, దు
ర్గంధయుతుఁ, గుష్ఠువాని వ
సుంధర దర్శింపరాదు ♦ శుభగుణచరితా!

వ. అనినం గుమారికారత్నంబునకు జనకుం డిట్లనియె.

క. పట్టీ! యీలా గందురె?
మొట్టినను విద్యనేర్పు ♦ టెంతో బాగా
గట్టిగ మీయిరువురకును
గట్టించెదఁ గాండపటముఁ ♦ గనరాకుండన్.

వ. అని యొడంబఱచి, మఱునాఁడు సమయోచితకృత్యంబులు దీర్చి,
కనకమణిమయ భూషణాంబరభూషితుండై కక్ష్యాంతరంబులు గడచి,

యెడనెడఁ బుడమిజేజేలు దీవనలు గైకొనుచు, బహుదినవివసితదేశాధీశులమనవులు సముచితజనులవలన వినుచుఁ, గొందఱు సుందరులు ముందర బారులై కైవారంబులు సేయఁ, గొందఱు కంజాతపాణులు మంజులగతి వింజామరలు వీవఁ, గొందఱు కీరవాణులు చేరి పరాకులు గావింప నొక్కకహ్లారగంధి కపురంబుబాగా లొప్పుమిగుల నందియ్య, నందియలుమ్రోయ నొక్కమందయాన యందంబుగ జందనాదు లొసంగ, సంగతి నూడిగంపుఁజెలు లిటు సముచితప్రకారంబునఁ గొలిచి రా, మందగమనంబున వచ్చి వచ్చి, రాజితకమలాకరంబుచందంబున నందం బగు రాజ్యలక్ష్మీలక్షితంబైన యాస్థానమంటపంబుఁ జొచ్చి, సముచితకాంచనాంబుజమధ్యంబున నధివసించు రాజహంసంబు సొంపునఁ గాంచనసింహాసనంబున మదనాభిరాజహంసంబు విబుధగణపరివృతుండై మహేంద్రుం డగుచు, సదా నక్షత్రసమన్వితుండై కువలయాధీశుం డగుచు, మహాభోగిపరివేష్టితుండై భూభృద్వతంసుం డగుచు, రాజకుమారసేవితుండై రాజశేఖరుం డగుచు, సముచితభాషాసమన్వితుండై చతురాననుం డగుచు, సుమనఃప్రసన్నుండై పురుషోత్తముండగుచు, నభంగులైన వాహినీశులును, నపుణ్యజనబాధలైన సుమనోవల్లభులును, సవనశాలులైన ప్రచేతసులును, ననంతకులైన సమవర్తులును, ననుగ్రహసహితులైన ధనాధిపతులును, నచంచలులైన మహాబలులునుఁ గొలువఁ గొలువుండి మంత్రివరులతో నిట్లనియె.

తే. ఓవసంతసురూప మ • హావసంతుఁ
డగు కళానిధిఁ బిలిపించు • మా కళాధి
వాసిముఖి కొప్పఁ బలికితి • వాసిమీఱ
ననఁగఁ బిలిపించెఁ గవివరు • ననఘమతిని.

క. వచ్చినకవివరుఁ గనుఁగొని
విచ్చేయుమటంచు నుచిత • విధుల నరేంద్రుం

డచ్చుపడ సలిపి, కొన్నియు
ముచ్చటలుం గడపి కుతుక ♦ మున నిట్లనియెన్.

ఉ. ఓకవిరాజచంద్ర ! విను ♦ మొక్కటిసెప్పెద, మత్కుమారి క
స్తోకకళావిశేషములు ♦ చొప్పడఁ జెప్పుచు, లక్ష్యలక్షణ
శ్లోకకవిత్వరూఢి కవి ♦ లోకము సన్నుతిసేయఁ దెల్పువిూ
మాకు గురూత్తముండవయి ♦ మత్కృత సత్కృతిగాంచి వేడుకన్.

♦ రాజు బిల్హణునితోఁ దనకుమార్తె కుష్ఠురోగియని చెప్పుట. ♦

తే. అయిన నొక్కటికలదు, మ ♦ దాత్మజాత
కుష్ఠరోగంబునను గొంత ♦ కొదవయయ్యె
వినయమందు మనీషాని ♦ వేకమందుఁ
గానమందుఁ బ్రవీణవి ♦ జ్ఞానహృదయ.

వ. అనిన గవిశేఖరుం డిట్లనియె.

క. ఓహో ! బాగాయెగద
యూహింపఁగ నెట్లు చెప్ప ♦ నోపుదు విద్యా
వ్యూహంబు ? కుష్ఠగాత్రిని
నాహా ! వీక్షింపరాదు ♦ హరివంశమణీ !

క. వ్రత మొకటికలదు మాకిల
శ్రుతిహీనునిఁ, గుష్ఠరోగిఁ ♦ జూడనటంచున్
మతి సంశయింపనేటికి
ధృతమతి మముఁ బంపుమయ్య ♦ ధీరవిచారా!

వ. అనిన విని రాజేంద్రుం డిట్లనియె.

క. దానికి నొక్కటిచెప్పెదఁ
గానియెడన్ నడుమ పటముఁ ♦ గట్టించెద స
న్మానముఁ గైకొని విద్యా
దానము జేయంగవలయు ♦ దాక్షిణ్యనిధీ!

ఉ. అందుకు బ్రాహ్మణుండు విన • యంబు, నయంబు మనంబు నొంద రా
జేంద్రునిఁ జూచి పల్కె వసు • ధేశ్వర ! మీ మన సట్లు యుండఁగా
నిందుల కేమియందు ? భవ • దీయవచోగతి మీఱరాదు, మే
లొందఁగ దోఁచినట్లు సతి • కొప్పుగఁ జెప్పెద విద్య నేర్పుచున్.

వ. అనిన విని సద్గంధకుసుమతాంబూలాది ప్రదానంబుల సంతుష్టుఁగావించి యుచ్చి, దరహాసితవదనుండై యిష్టసఖునితో నిట్లనియె.

తే. నీయుపాయము బాగాయె • నీతివేది
వనుచు భూషించి తత్క్షణం • బున నిమిత్త
కోవిదులఁ బిల్వఁబంచి య • క్కువలయేశుఁ
డనియె శుభలగ్న మీక్షింపుఁ • డనుచుఁ బ్రీతి.

వ. ఇట్లు ముహూర్తనిర్ణయంబుఁ జేసి, గృహకారుల రావించి, వివిధ చిత్రంబులుగా విద్యాశాల రచియింపఁజేసి,

— విద్యారంభము —

తే. అప్పు డా మదనాభిరామన్న • పాగ్రగణ్యుఁ
డతులమైనట్టి శుభదిన • మందు హితుల
బాంధవుల మంత్రిహితులను • బండితులను
గవుల రావించి బ్రాహ్మణ • కవినిఁ బిలిచి.

క. తనకూర్మి తనయ నధిపతి
తనతో రావింప వెంటఁ • దవిలి సదాళుల్
గని యామోదమునను రా
సదనంబునఁ జేరి పటము • చాటున నిలిచెన్.

వ. అప్పుడు పురోహితులు పుణ్యాహవాచనంబు లాచరించియున్న తద నంతరంబు.

తే. మొదల విఘ్నేశ్వరుని, వాణిఁ • బూజచేసి
బాల నారాయణమునం • బద్య మొదటి

యర్థయు క్తత నారంభ ♦ మర్థిఁ గఱపి
ప్రేమఁ జెప్పఁగఁ దొడఁగే నా ♦ బిల్హణుండు.

వ. అప్పు డప్పుడమిఱేఁడు సమ స్తవిద్వజ్జనభూసురాది బాంధవులకు భోజ
నంబులు గావించి మణిమయభూషణవస్త్రమాల్యాదిలేపన తాంబూ
లాది కృత్యంబులం బరితృప్తులంజేసి మఱియును,

మ. జననాథాగ్రణి, పుత్రికిం గపికి ని ♦ ష్టం బొప్పఁగా నిత్యభో
జన తాంబూలము లంచితాంబరములుక్ ♦ శయ్యాసనప్రస్ఫురో
పనముల్ తక్కువగాకయుండ నమరిం ♦ పన్ బిల్హణుం డవ్వధూ
మణికిం గావ్యము లాదిసేసి కఱపిం ♦ పఁగ్ సాగె నానాఁటికిన్.

క. సరసాలంకారమనో
హరకావ్యము లర్థయుక్తి ♦ మైఁ జెలువొప్పం
బరగ సుశబ్దవిచారము
వరసాహిత్యంబుఁ దేట ♦ పడఁగాఁ దెల్పెన్.

తే. జగతిజనములు మెచ్చ ♦ శ్చర్యమొంద,
లలితముగ బిల్హణాఖ్యుని ♦ సలన సకల
విద్యలు గ్రహించి జలధర ♦ వేణి యొప్పె
నంబుమింగిన త ప్తలో ♦ హంబుకరణి.

సీ. వివిధభావవివేష ♦ నవరసంబులయందుఁ
ప్రీతి నలంకార ♦ భేదములను
ఛందోవిభేదల ♦ క్షణవృ త్తనాట
కప్రక్రియల మహా ♦ కావ్యములను
కామప్రదములగు ♦ కామశాస్త్రములందు
జ్యోతిషశాస్త్ర సం ♦ గీతశాస్త్ర
ముల నభినయకళా ♦ కలితమార్గములందు
గణితతత్వామర ♦ కాండములను

తే. ప్రౌఢమైమించి శ్లోకార్థ ♦ భావ మెఱిఁగి,
సంస్కృతాఖ్యైకభాషాది ♦ చతురయగుచు

హితము మీఱఁ గవిత్వ మూ ♦ హింపఁదొడఁగు
యామినీపూర్ణ తిలక వా ♦ గతిశయమున.

—♦ చక్రబంధము ♦—

శా. ధన్యాసింహాభచంద్రకీర్తివర వి ♦ ద్యాపణ్డితార్యక్రమా
గణ్యాగర్వధనంజయాశిపదము ♦ క్తాకృత్ప్రగంకప్రభా
జన్యారాజితభూరిశాత్రవసుభృ ♦ జ్జాతిద్రమాపిక్రమా
మాన్యారాధన త్యాగ భోగ జయధా ♦ మా నవ్యభాగ్యోత్తమా.

మాలిని. కాండ భూభవాసితాంశు ♦ కాండ భూభవాదిరా
ట్కాండ భూభవాబ్జసుప్ర ♦ కాండ కాండ భూషరు
త్కాండ భూధవావగోర్మి కాండ తుండిరాట్ప్రభా
కాండ పాండుభావిభాన్య ♦ ఖండకీర్తిమండలా.

ఇది ప్రథమ[illegible]శ్వాసము.

శ్రీరస్తు.

# బిల్హణీయము.



## ద్వితీయాశ్వాసము.



శ్రీమానిత వర రఘుకుల
సోమా! సోమాంతరంగ ♦ సురుచిరభవనో
ద్దామ! విలాసయశోవర
సీమా! మహనీయనామ ♦ సీతారామా!

వ. అవధరింపుము తదనంతరంబ,

—* వసంతకాలాభివర్ణనము *—

చ. అలరె వసంతకాలము పు♦ రాంతికసీమ వనాంతపుష్పసం
కలితమరందపానభర ♦ కల్పితమత్తమధువ్రతాంకనా
కలమృదుగానలోల మతి ♦ కాంతరసాలవిశాలపల్లవో
జ్జ్వలపికనాదసంచలిత ♦ చారువియుక్తజనానుఖేలమై.

చ. అల మధుమాసవేళ జల ♦ జాయతనేత్రలు క్రీడసలువుచోఁ
గొలఁకులపజ్జఁజేరి నవ ♦ కోమలకాంచనపుష్పజాలముల్
హాలహాలికల్ గ్రహింపఁగ స ♦ దాళులు నీ! యనిరోసి యేగెభూ
తలమునఁ గాంచనాపహృతిఁ ♦ దల్పరుగా సుమనఃప్రవర్తనల్.

చ. చెలఁగు వసంతభూరమణ ♦ శేఖరుఁ డోలి మహావసిస్థలిన్
గలయఁగ నేల పైకమొస ♦ గం దగఁగ్రైకొని ముద్రఁబెట్టుచో
వలనుగ హేమరాశి మధు ♦ పాయికిఁ జూపక వైరిజాతులన్
మలయహరించు మిత్రు వసు ♦ మంతునిగా నొనరించె నాథ్యుఁడై.

మ. కమలామోదము సంఘటించి శుకవా ♦ క్యం బర్థి నాలించి, యా
సుమనఃకాండములెల్ల బోధముఁ గనన్ ♦ శోభిల్లఁగాఁ జేసి ని
త్యమహీభూతిఁ బలాశభేగనకళా ♦ వ్యాపారియై మాధవుం
డు మహిం గౌరవజాతి నేపడఁచి యుం♦డున్ సద్విజుల్ మెచ్చఁగన్.

చ. మనసిజచోరకుండు తరి ♦ మాటున బ్రమ్మఁజిగురాకుబాకు చే
కొని మెయి డాచి వేగఁ దమిఁ ♦ గొల్చి శశింబయిఁగాఁపువెట్టి తా
నెనయఁగ ధైర్యభిత్తిఁ బెక ♦ లించి సమీరపుమచ్చుఁ జల్లి చ
య్యన హరియించి మించెఁ బ్రమ♦దాంచితమానధనంబులెంతయున్.

చ. మరుఁ డను సోమయాజి వన ♦ మధ్యమునందు ద్విజాళి మంత్రముల్
కరముఁ బఠింపఁగా శిఖి ప్ర ♦ కాశిలఁ గాంచి మరుద్గణంబుల
న్వరుస భజించి రాజున క ♦ వార్యశుభోన్నతిఁ జెందఁజేసె నా
పరమమతిన్ వియుక్తవశు ♦ బంధము మాధవుఁ బ్రీతిసేయుచున్.

సీ. మాకందములనీడ ♦ మాందములు చూడఁ
జేకొమ్మ యోకొమ్మ ♦ చిగురుఁగొమ్మ
గోరంట డాయవే ♦ గోరంట రాయవే
యీచాయ యేచాయ ♦ నింపుఁజేయ
తిలకంబు మానినీ ♦ తిలకంబు బూని నీ
చెయ్యాన నియ్యాన ♦ చెలఁగునాన
పున్నాగములక్రిందఁ ♦ బున్నాగములఁ జెంద
నాసొంపు రతిపెంపు ♦ నందగింపు

తే. నిట్లు ప్రమదలు సఖులతో ♦ నెనసి మనసి
జాతదీపితహృదయలై ♦ సంతసమున
సరసవనకేళికామహో ♦ త్సవము లలర
వెలయుచుందురు మధుమాస ♦ వేళలందు.

సీ. ఘనరసాలంబుఁ గై ♦ కొనియెఁ గోకిలవాణి
పదరి పోఁబోకువే ♦ పల్లవోష్ఠి

యనుపమసరసిఁ దా ♦ నాఁగెఁ జక్రస్తని
మేలని కదియకే ♦ మీననేత్రి
చిగురించుఁ బలుగొమ్మఁ ♦ జెందఁ గుంజరయాన
చేరఁ జూడకవె రం ♦ భోరుయుగళి
కదలికాతరువందెఁ ♦ గర్పూరవరగంధి
కూడవే లికుచ వ ♦ క్షోజకుంభ
తే. యనుచు నొకబోఁటి యదలింప ♦ నతివగొనక
రామలార ! చంద్రాస్యలా ♦ ర ! హరిమధ్య
లార ! సురభిళనిశ్వాస ♦ లార ! పలుకు
మాను తపియించు దిగులొందు మాయు ననియు.
సీ. బింబోష్ఠి చిలుకలఁ ♦ బిలిచి ముద్దాడంగ
సాంకవగంధి మె ♦ చ్చ కను గదిరె
జలరుహాచరణ హం ♦ సల గారవింపంగ
ఘనవేణి రొప్పుచుఁ ♦ గడకునొత్తెఁ
గుసుమాంగి యళులఁ జే ♦ కొని తేనె లియ్యంగఁ
గాంచననాస త ♦ ప్పించి తటిమెఁ
గిసలయపాణి కో ♦ కిలములఁ బలికింప
రామాభిరామ యూ ♦ రకమొ పనిపెఁ
తే. బలుకులను యానముల ముంగు ♦ రులను గీత
ములను లేఁదోఁట నిరయుచు ♦ వెలఁదు లిట్లు
మఱునిబలములఁ గొందఱు ♦ మరులు కొలుపఁ
గొంద ఱవిచూచి నిరసింతు ♦ రందములర.
వ. మఱియును,
సీ. కలికి చిల్కలకొల్కి ! ♦ ఫలములుఁ గోయవే
కోకిలవాణి ! చి ♦ గుళ్ళు దేవె

దీటుగా సలిపేణి ! తేనియల్ కూర్పవే
పావనచరిత ! పు ♦ ష్పములు దేవె
కలహంసగమన ! మేల్ ♦ జలము లానించవే
చంద్రానన ! సుధార ♦ సంబుఁ దేవె
పాటలాధర ! వేగ ♦ వీటి ఘటింపవే
భర్మోపమాంగి ! దీ ♦ పంబుఁ దేవె

తే. యనుచుఁ దమలోనఁ జెలులు స ♦ య్యాటములను
సరసవనకేళికామహో ♦ త్సవము మెఱసి
యసమశరదేవుఁ బూజింతు ♦ రంద మలర
సారమధువేళఁ గాసార ♦ తీరములను.

తే. ప్రకటితాగమవాసనా ♦ ప్రథితములయి
విమలకాసారగౌరవ ♦ విభవమంది
లలితమైన వసంతకా ♦ లము సఁ గాన
సములు చెలువొందు నాకాన ♦ నవుల కరణి.

మ. పకియా ! కొమ్మలు పల్లవావళులతో ♦ సయ్యాటముల్ సల్పి హా
లికుచంబుల్ ఫలసంగతిన్ వెలయ నా ♦ లీలాగతుల్ గంటివే
పకియా ! కొమ్మలు పల్లవావళులతో ♦ సయ్యాటముల్ సల్పు హా
లికుచంబుల్ ఫలసంగతిన్ వెలయుటల్ ♦ చిత్రంబె యూహింపఁగన్.

ఉ. రాగముతో సదాళి తన ♦ రం బొదిసేయఁగ నీలతాంగి పు
న్నాగముఁ గౌఁగిలించి సుమ ♦ నస్థితి నున్నది చూడు మన్న ! హా
రాగముతో సదాళి తన ♦ రం బొదిసేయఁగ నీలతాంగి పు
న్నాగముఁ గౌఁగిలించి సుమ ♦ నస్థితి నుండుట చిత్రమే చెలీ!

సీ. చిగురాకు లవియేలఁ ♦ జిల్చెదరే ? వన
ప్రియచయాశాప్తి హ ♦ రింపరాదు
బిసకాండములు నేల ♦ విఱిచెదరే ? హంస
జీవనచ్ఛేదంబుఁ ♦ జేయరాదు

మకరందముల నేల ♦ మాఁబెదరే? సదా
　　ళినిరాకరణవృత్తిఁ ♦ బెనుపరాము
కువలయంబుల నేల ♦ గూర్చెదరే? ద్విజ
　　రాజసంప్రీతి నా ♦ ర్పంగరా ద
తే. టంచుఁ గొందఱు సుందరుల్ ♦ లంద మలర
వనుల సరసులఁ గ్రీడించు ♦ చనుదినంబు
సరసకాఁక్రొవ్విఁ జూపుచుఁ ♦ జతురలగుచు
వెలయుచుందురు మధుమాస ♦ వేళలందు.

వ. మఱియు నవ్వసంతసమయంబునం గాంత లింతింతనరాని సంతసంబున సంతతంతన్యమానతరుసంతానసితాంతకాంతంబులగు లతాంతంబుల నిరంతర పరిమళవంతంబు లగుట బంతులుగొను తేఁటుల రంతులకు నలంతఁగొను చింతల నత్యంత సుమరస దంతురాంతరంబులగు కనక వనాంతరంబుల కరిగి తదంతరంబుల వంతులుమీఱ సేమంతులు గోయుచుఁ బూబంతులఁ గట్టుచు నెంతయు వింతలగు గంతుని చిలికికుంతంబు లన మంతు కెక్కిన శశికాంతరుచుల వింతఁగొను దొంతరలగు గలికాసంతతుల కాంతిమంతంబులై పాన్తంబులనలరు వాసంతికాదంత నిశాంతంబు మంతనంబులు మెఱయ రతికాంత విజయోదంతంబులను పంతంబు నాడుచుఁ గొంతతడవు తోడనిం తులఁ గికురింపుచు, నిగనిగని పగడములవగఁ దెగడు నొగరు తొగరు పొగరు చిగురులఁ గోకనదముల కెగరు వగఁగొను మగకోయిలల తెగ తెగ లగు నెగు లెగయ నగపడక బుగులు బుగులుకొని మొగ ముల సొగసు చిఱునగవులఁ దగపగునే యనుచుఁ దగుల మిగుల నొగిలి సగమగుచుఁ బులుగులుకు సరిగనుపడ మగుడి సరిగపని జిలుగు నగరపు రయికలు బిగిబగుల నిగుడి పొంకంబులగు బింకంపుఁ జన్నుల నెలవంకల నింకకనువెడలు నకలంకలోహితాంకురంబులగు నంకుచిత సంకుమదకుంకుమపంకంబులుజాభ పంకజరసంబులు దోలం

గుహో కుల తేపియవంకల నిరువంకలు నలంకరించు లంకెలగు కంకేళి వనా గణ విటంకంబుల మీనాంక ధనుష్టంకార శంకాకంబులై సుం కలీన గొరవంక పలుకులకుఁ గొంకుచు జంకెలజంకెలువై చు జంకె చూపు లకలంకరత్నాంకిత తాటంకరుమల వంకెలుఁ గొను కింకరీ సంఘాతంబులవంకలఁ దలంపక నిల్చుచు నందంద యరవింద దంధ ందిలమందానిలసందోహంబులు కందళితకుంద చందనమందార బృం న్వితంబులై కురువిందమణి సందీపితంబులగు కొందలిరుకావి చంద ల నొంది మకరందబిందుబృందంబుల పొందుకఁ జిందు నందం పుఁగ కువింద పందిరులయందు నానందించు నిందిందిర సందోహంబులు సంద లేచి గందుకొన డెందంబులు కొందలపడ నిందిరకు మంది లంబు లగు కొందమ్ములకుం దావుల పందెమ్ములు జరుచుచు నందఱు పిఱుఁ కులడిందఁ గొందరు ముందఱ నరిగి యిందీవర మిళ నిమ్మిళింద ముఖ తాళిందమ్ములకు గందర్పబీజమాకందమ్ములక్రిందఁ బిఱుందులు చలిం నందియలు మొఱయఁ గుందనంపు సంది బొందియలు చంద యి లొరయఁ జింగులుఁ ద్రొక్కుచుఁ గందుకేళిం దేలుచు నిట్లు హరింపుచుండ ఫలపరిపాక సౌభాగ్య సంపన్న శుకసంభాష ణంబై భాగవతంబు కరణి వసుమతీజాతాభిరామంబై, రామాయ ణంబ పగిది నారూఢహరికుమార బాణాసనంబై, భారతంబు వై ఖ నామోదితసుమనోవికాసంబై, ఇంద్రనగరంబు బాగున స్నేహా భూ గంధవాహంబై, ధనంజయుని నివాసంబుపోలికఁ జక్రాంగపాళి శాన స్ఫురితంబై, దండధరునిలయంబుభాతి శోణోపరాగపలాశ దీ ప్తంబై, నైఋతినిశాంతంబు చందంబున నగశరువిలసితంబై వరుఁ మందిరంబురీతి సముదితగంధబంధురంబై, రాజరాజని కేతనంబు చా గ్రనఁ గందళిత మహాకోణాభిశోభితంబై, పవనునిభవనంబు కై వ విలసితకుందంబై, కైలాసంబుతీరున జాతిరహితంబై, యభే దన పంబు చెలువున నిఖిలద్విజసూక్తిగ్రాహ్యంబై మాధవుని

యంగంబున శుకపికవనప్రియచయంబులకు నిష్ఫలంబు లొసంగుచు సకలవిధకుసుమాకరంబై, కుసుమాకరం బొప్పుచున్న సమయంబున

—• సూర్యాస్తమయవర్ణన •—

సీ. కరినాథుఁ బట్టు న • క్రంబుపై విడిచిన
సరసిజాక్షుని చేతి • చక్ర మనఁగ
వరుణదిక్సుదతికి • వాసవుం డనురక్తిఁ
బంపిన కెంపుపూ • బంతి యనఁగ
నపరశైలాంతహ • ర్మ్యాంగజాలాంతరా
ర్పితమహాదర్పణ • బింబ మనఁగ
భువనాధిపతి ని • జపురమున బిరుదుగా
వల నొప్ప నెత్తిన • ధ్వజ మనంగ
తే. నభ్రసుందరి సుగుణర • త్నాకరునకు
మేలుగలుగంగఁ బలురత • నాలు గూర్చి
పట్టి త్రిప్పెడి యారతి • పళ్లె మనఁగఁ
గమలమిత్రుఁడు చరమభా • గమున నొప్పె.
మ. ఎనయన్ సర్వతి యంతరిక్షమునను • డేతెంచి యేమెంచునో
యనుశంకం గదుభీతిచే ఖరకరుం • డబ్ధిం బ్రవేశించెనో
యన నస్తాలయవాటికిం జనియె ను • ష్ణాంశుండు తత్పీఁడ యై
య్యనఁ దప్పెంగెద యంచు నక్కవలయం • బానందముం జెందగన్
ఉ. వారణదిగ్వధూటినిజ • వాటికిఁ బ్రేమ నినుండురాఁగ దా
భూరిముదంబునం బొదలి • భూరిమణీగణభూషనాణాళి కెం
పారెడుపట్టుచీరె మెయి • నంద ధరించి కుచద్వయంబునన్
గూరిమిఁ గుంకమం బలఁదెనో యన సారిధ్యముదోఁచె నమ్మెడన్
క. ఇనుఁ డరిగె ననుచు సమయాం
గన నీలపటంబుఁ దాల్చెఁ • గలయాశల మే

కొనియెదు జారిణికై వడి
నన జీకటి పుడమిఁ జెలఁగె ♦ నతిబహుళరంబై.

చ. అపరవధూటికామణికి ♦ నై యతిమోహముఁజెంది రాజు చో
క్కపు సిరిగల్గు మంత్రఘుటి ♦ కాతతి విచ్చినపూలుఁ గొన్ని యం
దపుఁ గప్పురంపుఁబూసలు ము ♦ దంబున వశ్యముగాఁగఁ బంచె నా
నపుడు సరోజజాండమున ♦ నంతట బొరులుదీటెఁ దాగకల్.

చ. మరుఁ డను భూమిపాలునకు ♦ మాపటివేళల దిక్పురంధ్రులున్
విరులను లాజులుంగలిపి ♦ వేడుక నేసలు జల్లిరో యనన్
సరవి నభఃప్రదేశ మను ♦ సౌధమునం దొనరించు దివ్యసుం
దరతరవజ్రపాళిక ల ♦ నందగెఁ జుక్కలు పిక్కటిల్లఁగన్.

—♦ చంద్రోదయాభివర్ణనము ♦—

మ. కుముదంబుల్ వికసింపఁ, గోకములు సం ♦ కోచింపఁ, గామిప్రజా
ళిమనంబుల్ దలకింప, నల్దెసలుఁ దె ♦ ల్వొం జెంది రాణింప, న
క్కమలంబుల్ ముకుళింప, వెన్నెలలు వే ♦ డ్కన్ మింటసూచింపఁ,
దమసంబుల్ సడలింపఁ, జిత్తరుల చి ♦ త్తంబుల్ విజృంభింపగన్.

చ. తొలిదెస కెంపునొంద, సయుఁ♦తుల్భయమందఁ, బయోధిపొంగఁ,ద
మ్మలు ముగుడంగఁ, గల్వలు ప్ర♦మోదము నింపఁ గవ ల్చలింప,మి
న్నోలయుఁ, దమిస్రముం బోలయ ♦ వెన్నెలపుల్గులుఁ జేర, మారుఁ డ
గ్గలమయి మీఱఁ,జందురుఁడు♦కాంతులఁజల్లుచుఁ దోఁచెనెంతయున్

తే. మదనుఁ డిగురాకుఁదూపులు ♦ పదనువెట్టు
కళలఁ తేరెడు శాణచ ♦ క్రం బనంగఁ
దామసీసతి కర్ణావ ♦ తంస మనఁగ,
నుదయగిరిఁ జంద్రమండలం ♦ బుదితమయ్యె.

—♦ యామినీపూర్ణతిలక యుద్యానవనంబున విహరించుట ♦—

వ. ఆసమయంబున యామినీపూర్ణతిలక యనుగతసదాళితిలకయై ప్రొద్దు
వోక నిదురాక లేచి నద్దెసలం జూచి దండ నుండు నొక్క వేదండ

యెన్నియుండిన బ్రాహ్మణు ♦ నెంచరాదు
'బ్రాహ్మణాన్ భర' యనియెడు ♦ పలుకు వినవె?

వ. అని దీనాలాపంబుల నబ్బాలామణి విలపించుచు మఱియు మఱియుఁ బలికిన వైశ్వానరునియందు ఘృతంబుఁ జిలికినచందంబున మండిపడి ప్రత్యుత్తరం బియ్యక విముఖుఁడయినఁ గంబుకంఠి రాజువలనఁ దిరస్కృతయై యాస్థానంబు వెడలిపోవుచు నిట్లనియె.

సీ. తండ్రి నాపయి సింత ♦ దయ నింపఁడాయెఁగా
డాయఁగాఁ బోయి నే ♦ దండ మిడినఁ
దల్లి యుద్దపడి తాఁ ♦ దప్పించదాయెఁగా
దాయుగాఁ దఱఁచెనో ♦ తనయ యనక
నాళీరవ్రశేణి ♦ కాత్మ నింపాయెఁగాఁ
బాయఁగాఁ రాని యీ ♦ పాటు విన్నఁ
గలవారికెల్లఁ గ ♦ న్నులు చల్లనాయెఁగా
నాయగాథంపుఁజం ♦ దంబుఁ గన్నఁ

తే. గటకటా! యెవ్వరైన నా ♦ కష్ట ముడిపి
ప్రోవలేరైరి లేరైరి ♦ భూతదయులు
నేమిసేయుదు నేమందు ♦ నెందుఁజొత్తు?
ననుచు వగచుచుఁ గవిమార్గ ♦ మనుసరించి.

—♦ కాంతామణి కవినిగూర్చి విలపించుట. ♦—

ఉ. హా! కవిరాజరాజమణి! ♦ హా! నవమోహన! హా! మనోహరా!
హా! కరుణాగుణాభ్యుదయ! ♦ హారమణీనవపంచసాయకా!
హా! కమనీయగాత్ర! యొక ♦ రైన నిను గృపఁ బ్రోవరైరయో!
యీకడ నీవు దైవమున ♦ కేమివిరోధము జేసితో కదా!

సీ. వికటరుగ్రహామహా ♦ విషము కంఠంబున
దాక్షాయణీశుండు ♦ దాల్పలేదె

సతతమర్వారవి ♦ స్ఫురితశిఖాబడబాగ్ని
జలధి యంతరమున ♦ నిలుపలేదె
సకలచరాచర ♦ జంతుజాలమునెల్ల
నేర్పడఁ బుడమి వ ♦ హింపలేదె
పృథివీతలంబెల్లఁ ♦ బృష్ఠభాగమునందు
నిలఁ గూర్మపతి భ ♦ రింపలేదె

తే. యంతకన్నను గవివరు ♦ నందుఁ గలదె
దోషభర మెవ్వరైనను ♦ దొడరి ప్రోవ
రయ్య! భూపతి వినఁ జెప్ప ♦ రయ్య! కరుణ
నింపరయ్య! నావెత నివా ♦ రింపరయ్య!

సీ. మోహించి గౌతమ ♦ మునిసతిఁ బొందిన
పురుహూతు నమరులు ♦ బ్రోవలేదె
గురువధూగమనంబుఁ ♦ గోరి చేసినచంద్రు
నీశుండు మౌళి వ ♦ హింపలేదె
కడిమిమై కూఁతును ♦ గని పొందఁగోరిన
పరమేష్ఠి శౌరి చే ♦ పట్టలేదె
స్మరవశుండై సీత ♦ చనుదోయి గీఱిన
కాకిని రఘుపతి ♦ కావలేదె

తే. యంతయును ద్రోహ మీతని ♦ యందుఁ గలదె?
నేను గోరిన విప్రుండు ♦ గాని, యితర
వంశజుఁడు గాఁడు ధర్మంబు ♦ వరుసఁ జూడఁ,
బుణ్యు లెవరైన నీకవిఁ ♦ బ్రోవరయ్య!

వ. అని మఱియు నిట్లనియె.

—♦ పౌరజనపరస్పరవాక్యములు. ♦—

ఉ. ఆకవిరాజుఁ బ్రోవ తన ♦ కర్హ్యముఁ గాక యటంచు సుందరీ
లోకశిరోవిభూషణము ♦ లోలత దిక్కులు చూచి తెంపుమై

రాకలు పోకలుం గలుగు • రాజుల నార్యులఁ గాంచి యెంతయున్
శోకముతో విలజ్జ యయి • సోలుచు వ్రాలుచుఁ బల్కె నిట్టులన్.

సీ. ఎక్కుడుగా మది • నెంచి పండితహంస
నాదరింపరె చతు • రాస్యులార!
కారుణ్యమున గతి • గల్పించి ద్విజరాజు
భరియింపరే చక్ర • భరణులార!
నిరుపమసత్కళా • నిధిని మన్నింపరే
తలయొడ్డి రాజ • వతంసులార!
విదితనిరాధారు • విబుధేంద్రు నిలుపరే
యిరవొంద భూరిధ • రేంద్రులార!

తే. సుకవితాపంబు దీర్పరే • శూరులార!
బ్రహ్మకులజునిఁ దేరె గో • పాలులార!
ధర్మగతిఁ బూని, రాజకం • దర్పులార!
నామనోహరుఁ గూర్పరే • నాయ మెఱిఁగి.

వ. అని బిల్హణు నుద్దేశించి ముద్దియ యిట్లనియె.

మ. అరవిందంబులరీతిఁ జెన్నలరు నీ • హస్తంబు లెట్లోర్చె ము
ప్పిరిగాఁ బెంచిన కాలపాశములకు • న్ముగ్ధాంగనాగానభ
వ్యరసోత్కర్షములైన నీశ్రుతియుగం • బత్యుద్ధతోర్వీపకిం
కరవాదార్భటి కెట్లుతాళె మదనా • కారా! మనోనాయకా!

వ. అని యిట్లు పొగిలి పొగిలి.

తే. తరుణి నగరంబు గడచి పోఁ • దలచియున్న
నున్నతాకారు లచ్చట • నున్నవారు
వారణము సేయ నంతఁ ద • ద్వారసీమ,
సీమవారెల్లఁజూడ వీ • క్షింపుచుండె.

వ. ఆసమయంబున నగరజనంబులు దమలోనఁ దామిట్లనిరి.

సీ. అవనీశ్వరుఁడు నమ్మి • యంతఃపురంబులోఁ
జేర్చి నెంతయుఁ • జేసె నితఁడు
కన్య నీవిధమునఁ • గలుషాత్ముఁడై రతి
గలసె దానికి నింక • గతియు నేమొ
యెంతపనికిఁ జొచ్చె • నీభూసురాధముఁ
డేర్పడ నిది బైట • నెల్లబడియె
దాఁగునా యిట్టిది • ధరణీశుఁ డెంతయుఁ
జేసె నిర్వ్వరకు వీ • క్షింపకుండ

తే. విప్రుఁ డెక్కడ, మేదినీ • విభునిపుత్రిఁ
గలయు టెక్కడ? యిదిచూడఁ • గడిదివింత,
చెలఁగి చేసినవారికిఁ • జేసినంత
యనుభవింపక తీఱునా • యవనిలోన.

క. ఏకాంతంబున నుండిన
లోకములోఁ దలఁప నెట్లి • లోటులకైనన్
డీకొలుపు బుద్ధి పతిపైఁ
బ్రాకటముగ నారి ననఁగఁ • బనియేమి యిఁకన్ ?

ఉ. చక్కనివారిలో మిగులఁ • జక్కనివాఁడు కవీంద్రమౌళి యా
చక్కెరబొమ్మ యట్టిదె వి • చారము లేటికిఁ జూచునంతలోఁ
జక్కెరవింటిజోదు రభ • సమ్మునఁ దూపులు వింటఁగూర్చి బల్
చిక్కులఁ బెట్టకుండునె వ • చింపఁగ నొంటిగ నుండువేళలన్ !

చ. కటకట ! యెట్లు భూసురునిఁ • గాసియొనర్చుఁ డటంచుఁ బంచెన
క్కుటిలుఁడు భూమిపాలుఁ డిది • కూడదు చెప్పఁగ నేరికైన నిం
తటికిని దైవయోగముక • దా తలపోయఁగ వానిభాగ్య మి
ప్పటి కిటులుండె, నిట్టిపని • ప్రాజ్ఞుని కెచ్చటనైనఁ బాడియే.

చ. ఇల నిఁక వీనిఁబట్టి వధి • యించిన నీనతిమేనఁ బ్రాణముల్
నిలుపదు వానికిన్ జనని • నిల్వదు భూవరుఁ డంతట న్మదిం

దలఁపఁగ నేమియానో, యట ♦ ధారుణి యేవిధమానో, యింతకుం
జలమఱి భూవిభుండు కవి ♦ సమ్మతి బ్రోచిన నన్ని చక్కనో.

వ. అని యిట్లు వేఱువేఱ గుంపులుఁగట్టి పలుకుచున్న నొకకొంద ఱిట్లనిరి.

క. చోరుఁడను నామ మీకవి
కారయఁగను నేఁటికిలి య ♦ థార్థం బయ్యెన్
జారుఁడు మఱి రెండుం దగు
శూరులు మెచ్చుదురె జార ♦ చోరత్వంబుల్?

వ. అనుటయు నక్కాంతాలలామం బక్కవివరునిం జూచి యిట్లనియె.

ఉ. హా! కవిరాజచంద్ర! మద ♦ నాంచితవిగ్రహా! నన్ను నిప్పు డ
స్తోకవియోగవారినిధిఁ ♦ ద్రోచి చనం దగవౌనె నీకు న
య్యో! కరుణాంబురాశి వని ♦ యుల్లమునం దగనమ్మియుంటి, నీ
వేకత మెట్టులేగెదు ర ♦ హిం గవగూడిన మేలు సెందదే.

వ. అని విలపించుచున్న మార్గంబునం బోవుచుండి విని బిల్హణుండు దోధూయమానమానసుండై తిరిగి చూచి యిట్లనియె.

—♦ బిల్హణుండు కామినింగూర్చి పలుకుట ♦—

ఉ. హా! కమలాయతాక్షి! చెలి! హా సరసీరుహకుట్మల స్తనీ!
హా! కమనీయగాత్రి! సతి ♦ హా నవమోహిని! హా వధూమణీ!
హా! కనకాంగి! నేను విడ ♦ నాడితినంచు దలంచె దీవు నీ
లోకమునందు జీవునకు ♦ లోలతగాక స్వతంత్ర మున్నదే?

ఉ. ఓ రమణీమణీ! వికసి ♦ తోత్పలపత్రవిశాలనేత్ర! న
న్వారక యేలఁ జూచెదవు ♦ ద్వారనివాసిని గోల దేవతా
వారవధూటికానయన ♦ వాగురికావలయంబునందు దు
ర్వారతఁ జిక్కి తా మగిడి ♦ వచ్చునె బిల్హణుఁ డెన్నిభంగులన్?

వ. అని పలుకు భూసురవరునిఁ దలవరు లురుగతి బదమని శ్మశానవాటికిఁ దోడుకొనిపోయి యొక వటవృక్షంబుక్రింద నిల్పిన బిల్హణుండు నలుదెసలం జూచి తల్లడిల్లనియుల్లంబుతో మందస్మితవదనారవిందుండై వీరి సేనున కిట్లనియె.

క. ఓ తలవరి ! తడవేటికి ?
నాతతనిశితాసి గొని ధ ♦ రాధీశుని యా
జ్ఞాతంత్రమునను బిల్హణు
వే తెగవ్రేయుము శిరంబు ♦ విశ్వము మెచ్చన్.

వ. అనిన విని వీరసేనుం డిట్లనియె.

క. కవిరాజవర్య ! నీ కీవు
డవిరళగతి నించుకైన ♦ నాత్మభయంబుం
దవులక దరస్మితాస్యుడ
వవుటకు గత మెద్ది సెప్పు ♦ మమలవిచారా !

వ. అనిన బిల్హణుం డిట్లనియె.

చ. హితమతి చెప్పెద న్వినుము ♦ హీనగుణాకర వీరసేన ! యా
క్షితిరమణాత్మజాత, సర ♦ సీరుహలోచన మంత్రదేవతా
కృతియయి వేడ్కఁ నాహృదయ ♦ గేహమునందుః జోడుగూడి తా
సతతము బాయకున్నది వి ♦ చారము లేటికి దైన్య మేటికిన్.

వ. అని మఱియు నిట్లనియె.

చ. కలికి వధూమణిన్ స్మరవి ♦ కస్వరచారురుచిన్ గుణాకరన్
సలలితతుంగపీనకఠి ♦ న స్తనమధ్యగహారభాసురం
బౌలతియు మోము నంటి రుచి ♦ పొందు సుధాకరమైనరీతి నా
తిలసుమనాసిక న్మదిని ♦ దేవతగా స్మరియింతు నెంతయున్.

—♦ తలవరి కవిని ఖండింపక యుంచుట ♦—

వ. అని తదేకాయత్తచిత్తుండైన కవివరునిం జూచి ఖండింపఁ జేతులుర
హృతబహుజనప్రాణం బగు కృపాణంబు నేలంబడవైచి వీరసేనుండు
కృపాధీనుండై నిలువంబడియున్న తదనంతరంబు యవ్విప్రుండు రాజ
పుత్రుని హృదయంబున నుపలక్షించి యిట్లనియె.

చ. పరమసువర్ణచంపకవి ♦ భాసురగౌరి సురోమరాజి ని
ద్దురఁగొని మేలుకొన్నసతి ♦ తోయరుహాంబకవిహ్వలాంగిఁ దా

మరసఁగళాయతేక్షణఁ బ్ర ♦ మాదవశంబునఁ బోవు విద్యవై
ఖరి మదిలోన నెప్పటికిఁ ♦ గాంక్షఁ దలిర్పఁగఁ జింతఁ జేసెదన్.

మ. విలసత్పంకజపద్మగౌరి రుచియే ♦ పెంపొందు గోరోచనా
తిలకోదంచితపాటలద్యుతికన ♦ ద్దివ్యల్లలాటంబు పై
లలి నొక్కింతముదంబుచే నలసలీ ♦ లాఘూర్ణదృక్కాంతమై
చెలువొందున్ సతిమోమునన్ నిలుచు నా♦చిత్తంబు యుక్తంబుగాన్.

చ. శ్రమజలసాంద్రబిందుతతి ♦ సారపుమౌక్తికరాజవైఖరిం
గొమరు సెలంగ హేమమణి ♦ కుండలదీప్తులు గండభాగముల్
రమణ రహింపఁగా నుపరి ♦ రత్యనుభూతి నియోగమంది చె
ల్వమరు తదాస్య మిప్పటికి ♦ నాత్మభజించెద నిశ్చలుండనై.

ఉ. పున్నమనాఁటిచందురుని ♦ బోలు మొగంబులు మొల్క చన్నులున్
సన్నపుటారు, లేవయసు ♦ చాయలఁదేఱిన మేనుసొంపు, నా
కన్నియరూపు నే మగుడఁ ♦ గాంచితినేని మనోజసాయకా
గ్ని న్నెఱికాఁకఁ దోఁకొనిన ♦ నెమ్మది నెమ్మది చల్లఁజేయుదున్.

ఉ. ఏవిధిఁ గాంతు నారమణి ♦ నే నొకరాతిరి తుమ్మినం జిరం
జీవి యటంచుఁ దచ్ఛుభవి ♦ శేషవచోవిభవంబు మాని రో
షావహచిత్తయై పలుక ♦ కందపుఁగమ్మ ఘటించెఁ గర్ణమం
దావిధి నామట న్మదలి ♦ యాడుచు నున్నదిగా ఘనంబుగాన్.

ఉ. ఉన్నతచారుపీనసుప ♦ యోధర, భావజుచేతిచిల్కనా
చెన్నగు నూత్నయౌవనము ♦ చేఁ దనరారు సుధాకరాననన్
గ్రన్ననఁ గౌఁగిలించి వద ♦ నంబు ముదంబున ముద్దుపెట్టుదున్
పన్నినవేడ్క నుత్తమధు ♦ పంబు సరోరుహ మానుకైవడిన్.

ఉ. మానిని విస్ఫురత్కమల ♦ మంజులపత్ర విశాలలోచనం
బీనకఠోరతుంగకుచ ♦ భృంగగరుద్రుచినీలవక్ర స
న్మానితకోమలాలక స ♦ మానవరాకృతి కామదేవతన్
దాని గురూపదేశముచి ♦ ధంబున ధ్యానము సేతు నాత్మలోన్.

మ. నెఱివాల్ చూపులు మొల్లక్రొవ్విరులకాం ♦ తిం జెందుఁ బల్జాడ సుం
దరమై తేనెలు జిల్కు మోవిగల యా ♦ తన్వంగి వక్త్రాబ్జ మీ
ధరణిన్ సాధుపరోపకారము మదిన్ ♦ దల్చుం గృతజ్ఞుం బలె
న్నరయ న్నామది మర్వ నిప్పటికి న ♦ త్యంతానుభావుండనై.

ఉ. దీటు సెలంగఁ బంచశర ♦ దివ్యధనుర్గతమత్తభృంగరా
ట్కోటి గరుత్ప్రభారుచిర ♦ కోమలకర్బురితాలకంబులం
దేటగు దంతపత్రముల ♦ నీలసరోరుహభూషణంబులన్
లూటిగ దానిమోము మది ♦ లోఁ దలఁపోయుదు మాటిమాటికిన్.

శా. తెల్లంబై చిఱునవ్వువెన్నెలలచేఁ ♦ దేల్పొప్పు లేఁజెక్కులన్
మొల్లంబై తగు చంచరీకములగో ♦ ముం జెందు కేశమ్ములం
బ్రొల్లీవాంకశరత్సుధాంశురుచి నొ ♦ ప్పన్ భారునెమ్మోము నా
యుల్లంబుం జివురింప నిప్పటికి నే ♦ నుప్పొంగి వీక్షించెదన్.

చ. దరము హసించు కంధర ము ♦ దారత నొంచి కరాంబుజాతమున్
వరకటి సంఘటించి జడ ♦ వామభుజంబున గబ్బిగుబ్బ రా
న్నొరయ వహించి నిల్వఁబడి ♦ యమారక నన్ను ననేకరీతులన్
వరమతిఁ జూచు నత్తరుణి ♦ వర్ణన చేసెద నే ముదంబునన్.

ఉ. నే నపరాధినై యడరి ♦ నేర్పునఁ దత్పదపంకజంబులం
బూనికతోడ మతం బడినఁ ♦ బోవఁగఁ ద్రోచి చరించుచున్న య
ద్దానిచెరంగు వట్టిన ముదా ♦ త్రతనిగ్గుకకోప మయ్యెడన్
మానకయున్నదాని వర ♦ మానిని నాత్మఁ దలంతు నెంతయున్.

చ. సరిగాని నేల నేలు సువి ♦ శాలనితంబము లొప్పుదాని, మే
ల్సరసులలోఁతుఁ గాంచి బలు ♦ సమ్మతముల్ గనునాభిదాని, మం
దరగతిఁ గల్గుదానిని, మృ ♦ ణాళసమానవిలాసబాహువుల్
బరఁగినదాని నెన్నెదను ♦ భావమునం దనుమధ్య నెప్పుడున్.

ఉ. అప్రతిమానబోధసుర ♦ తాంతమునందు నిమీలితాక్షియై
కప్రపుఁదావి మాటికిని ♦ గ్రమ్మఁగ నూర్పులవేఁడి వాడిగం

దగ్గఱ చిన్ శ్రమాంబువులు ♦ దార్కొని రాలఁగ నొప్పువాని నే
న య్యయురాలిమోము సుమ ♦ నస్థితి నిప్పటికిం దలంచెదన్.

ఉ. నాఁటెడ నొక్కమాటయు మ ♦ నంబున భావనజేసి మాటికిన్
డాఁచక నంతరంగమున ♦ డాపటిపట్టున కోపభావయై
యీయుతబాష్పకంఠయయి ♦ యప్పటియూర్పుల మోవిగ్రాఁగగాఁ
జేరుఁదొడంగె రోదనము ♦ చింతనసేయుదు దాని నెంతయున్.

శా. ఏకాంతంబున నొక్కనాఁడు గృహమం ♦ దెవ్వారు రాకుండఁగా
నాకజేక్షణ దర్పణంబుఁ గొని పీ ♦ ఠాసక్తనుండంగ నే
జోకన్ వెన్కవసింప మత్ప్రతినిధిం ♦ జూచెంతయు న్సిగ్గుతో
వాకంపించి భ్రమించి మించె మదనో ♦ ద్యన్మానసాంభోజయై.

చ. మఱియు సుగంధయుక్తమయ ♦ మంజులమై తగుమోముదమ్మిపైఁ
దిరిగెడు గంధలుబ్ధమగు ♦ తేఁటిగమిం గనుదోయి మాటికిం
దెఱచుచు మూయుచు న్మొగముఁ ♦ ద్రిప్పుచుఁ గేలిసరోరుహంబుచే
దఱుముచు నొప్పు నప్పులఁతి ♦ ధ్యానముసేసెద నిట్టివేళలన్.

మ. ఒకనాఁ డొక్కెడ శ్రోణిపై వలువ జా ♦ ఱుండంగ నే నంతలో
నకలంకస్థితిఁ బోవ సిగ్గుపడి యా ♦ హా యంచు నా పిక్కలాం
గనయై భీతిని నొక్కచేత మనినా ♦ గారంబు వేమూసి నే
నొకచేఁ బొక్కిలిఁ గప్పు నప్పడఁతి నే ♦ నూహించి ప్రార్థించెదన్.

చ. అనుచునిటు ముందువెన్క బహి ♦ రంతరసీమల నన్నిదిక్కులన్
స్ఫుటతరకాంచనాంబురుహ ♦ శోభితమంజులసుందరాస్యయై
తటుకున వాలుఁజూపులను ♦ దా ననుఁ జూచుచు సంచరించు న
చ్చటులవిలోచన న్మదిని ♦ సన్నుతిసేసెద నేఁ బ్రియంబునన్.

శా. ఆక్రాంతములై మదాలసములై ♦ యబ్జోపమానంబులై
శ్రీకళ్యాణములై రమానరసుతో ♦ ద్రేకంబులై యొందవా
స్తో... ప్రవతులై మధ్యుంతటి... ♦ శోభాయమానంబులై
యా ...క్షివిశాలనేత్రములు నా ♦ స్వాంతంబునం దొప్పెడున్.

మ. బలుయూర్పుల్ గనుడంగ నేత్రయుగళి ♦ న్బాష్పాంబుధారాల సం
చలనం జూచుచు నావిధం బకుగుమని ♦ స్వాంతంబు నానావిధం
బులఁ బోఁగా మనమందు పైకొనఁగ నౌరా • మనున్ బోల్చి చింతించుచు న
న్బులిభిన్నలశిలాకచన్ మదిని నే ♦ భావింతు నల్లప్పుడున్.

ఉ. వేకువ నొక్కనాఁడు నిజ • వేశ్మమున న్మఱికొప్పు వీడఁగాఁ
గోకిలవాణియు న్మిషిత ♦ ఘూర్ణితదీర్ఘవిలోచనాబ్జయై
వేకువ నిద్రలేచి రుచి ♦ దేరఁగ నొక్కిన మోవి కేలినే
నా కరగప్పుచానను మ ♦ దాత్మను నిప్పటికిం దలంచెదన్.

చ. మఱియొకనాటిప్రొద్దునను ♦ మానక బంచటరుంగుపైని దా
నిరవుగ నెచ్చెలిం గడసి ♦ యింతి ప్రియోక్తులు పల్కుచుండ నే
బఱువున వచ్చి వెన్క నిలు ♦ వంబడినంతనె చూచి సిగ్గునోఁ
జెఱునగ వొప్పఁ బోవుదగ ♦ జిత్తమునం దలపోసి చూచెదన్.

మ. అపరాధం బొనరించితి వనుచు న ♦ న్నత్యంతకోపంబుతో
నుపలాలింపక నెమ్మొగం బియక నో • హో చాలుఁ జాలుం జుఁ బో
నవుడు న్నేను బ్రియోక్తి నాముకొన న • త్యాసక్తి లేనట్టి మా
ట వచారించిన నవ్వధూటిఁ గవుఁగిం ♦ టం జేర్చి లాలించెదన్.

చ. సడుకొని యంతలోనఁ బరి • భావితయై వడి లేచి నిద్రచేఁ
దోడవడి యావలించి మెయి ♦ దోట్రు విదిర్చి విజృంభణక్రియం
బొడమిన మోమువాననకుఁ • బూని భ్రమించుచునున్న తేట్లసం
దడికి జలించునట్టి కను ♦ దమ్ములు గల్గినదాని నెన్నెదన్.

చ. మనసిజపూజ సేయ నిజ ♦ మానినులందఱు గూడి కేళికా
వనమున కేగుచో దనదు ♦ పార్శ్వమునన్ వసియించు నన్ను జూ
చెనని శంకతోడ జను ♦ లేమనుకొందురో యంచు భీతియై
తుణ మిటులుండు మంచు గను • సన్న రొయుసర్చినకన్య నెన్నెదన్.

చ. సరసిజనేత్రి తా బ్రథమ ♦ సంగమవేళను సిగ్గుదోప నే
నరయుచు ధైర్యవృత్తిఁ గది ♦ యంగ దలంచిన జూచి పూత్కృతుల్

నెరపఁగ నందు దీపశిఖ • లీనతగంబము నొందు కర్ణభా
సురకుముదంబుఁగప్పి సతి • జూచెద నిప్పటికిన్ ముదంబునన్.

చ. చెలి తమితోడ నెచ్చెలుల • నీఁయని గోపము సేసి శీఘ్రతం
దలతల మంచు బోఁగదిమి • తత్పరతం బులకల్ జనింపగా
నలరుచు సంస్మితాస్యయయి • యంతట నాదెసవచ్చి కూటమిన్
గలసినభామినీమణిని • గాంచెద గన్నులకర్వు దీఱగన్.

మ. కలకంఠోపమకంఠనాస్యజితరా • కాచంద్రబింబ న్మయూ
రలసద్బర్హ సిమానవేణి సుగుణ • వాఃతాత్మ నేత్రప్రభా
విలసన్మత్తచకోరయానవిలస • శ్వేతచ్ఛదం గాంచనో
జ్జ్వలకుంభస్తని గామినీమణిని నే • భావింతు నెల్లప్పుడున్.

మ. విరిశయ్యం బవళించి మన్మథ సుఖా • విర్భూతి కాంగంబులన్
సరిగావింపుచు గౌగిలించి ముద మెు • చ్చ న్నాదు కెమ్మోవి నుం
దరవక్త్రంబున నిల్పితా సురతసం • ధానంబు గల్పించు శం
బరవిద్విడ్ధ్వజవై జయంతి మది సం • భావించి ప్రార్థించెదన్.

ఉ. సిబ్బెపుగబ్బిచన్నుఁగవ • చెన్నుగ నిక్కఁగ నక్కలించి యం
దబ్బురపాటు గన్పడఁగ • వింగవిభంగమిషంబునన్ రుచుల్
గుబ్బతిలంగ బాహులత • లుం బయికెత్తి గభీరనాభి పె
ల్లుబ్బిన వేడ్కఁ జూపు చెలి • నుల్లమునం దలపోసి చూచెదన్.

చ. వరుస వివర్తితంబులయి • వ్రాలు నపాంగవిలోకనంబులన్
మరుదశనోపమానమృదు • మంజులసుందరభాషణంబులన్
దరమధురస్మితంబులను • దాళిమియానములన్ విలాసతన్
సిరు లెసఁగంగ నొప్పుచెలి • చేష్టలు నామది సంస్మరించెదన్.

చ. కనఁగవ యించుకంత నెఱి • గా నొనరించి సరత్న పాళికం
కణముల ఝుంకృతిధ్వనులు • గౌరవమొప్పఁగఁ జన్నుదోయి నొ
క్కను గనుబొమ్మలెత్తి నిజ • కైశ్యము చక్కఁగ మెచ్చొనర్చు మా
నిని బలుమారు నిప్పటికి • నేమదిలోన భజింతు నెంతయున్.

చ. అరయ సహింపరాని విరహా ♦ గ్నిని జెందినట్టి రమణంబులన్
సురతవిశేషసంగతులఁ ♦ జొక్కపుఁ జెందికవసుంధ్రద్ధారిద్ర్యా
తరమిడి యంగమంగము న ♦ దాఁకఁగ గౌఁగిటఁ బట్టి కన్నుదో
యరయిడి చెక్కునొక్కసతి ♦ నాత్మభజించెదఁ గోర్కెమీఱఁగన్.

చ. విలసితమన్మథన్ విరహ ♦ విహ్వలబాలసరాతి సుందరిన్
లలితకురంగనేత్రి సు ♦ లాసముసాంద్రలిప్తచారుకాంచనో
జ్జ్వలమహనీయచేలయును ♦ శ్యామవిరాజిత హంసయాన నే
నలవడ సంస్మరించెద న ♦ నారతముల్ మదిలోన వేడుకన్.

చ. మలయగిరిప్రభూతపవ ♦ మానములం గని తీవ రాడఁగా
నలలితరత్నవేదిపయిఁ ♦ జక్కఁగఁ దా వసియించి గీతముల్
దలకొని వీణ సుస్వరయు ♦ తంబుగఁ బాడుచు నాళిపాళికిన్
లలి నయనోత్సవం బొసఁగు ♦ లక్షణగాత్రిని నే భజించెదన్.

♦ వీరసేనుండు కవి రచించు పద్యంబుల రాజునకుఁ బంపుట ♦

వ. అని యిట్లు కవివరుండు మదనోన్మాదంబున యామినీపూర్ణతిలకా యత్తచిత్తుండై తద్వర్ణనాతివిశేషంబులుగా రచించిన పద్యంబులు యళిపత్రంబునఁ దద్భృత్యులు భూపాలుని కప్పటకప్పటి కర్పించినం జూచిచూచి యంతకంతకుఁ గోపాటోపంబునఁ గసరివేయుచున్న విసికి విసికి తద్వృత్తాంతం బంతయుఁ గవివరుండు విన వీరసేనున కిట్లనిరి.

చ. హిమరుచినత్కళావిభవుఁ ♦ డీకవిరాజు రచించునట్టి ప
ద్యములు గ్రహించి రాజునకు ♦ నర్పణచేసినఁ జూచి కోపభా
వమున దురుక్తులం బలికి ♦ వారకఁ బొమ్మనుఁ గాని మంచిమా
టమరఁగఁ బల్కఁ డప్పుడు త ♦ దాగ్రహవృత్తి వచింప శక్యమే.

చ. అనవుడు వీరసేనుఁడు ద ♦ దాననముం గని యోకవీంద్ర నీ
వనఘుఁడ విందిరావరను ♦ తాభుఁడవు న్నిను హింససేయఁగా
మనమున నత్క్రుపామతిని ♦ మానితిఁ బూనితి నే భరింపఁగాఁ
బనివడి వ్రాయుపద్యములు ♦ పార్థివుఁ డొప్పఁ డిదేమి సెప్పుదున్.

క. ఇదియేమి మాటిమాటికి
హృదయంబున లేదె భీతి ♦ యెంతయు నన నా౽
డదరక సామీ భూవర !
యిది చూడుఁడు యొక్క వింత ♦ యేమో తలఁపఁగ.

వ. అనిన లిఖితంబుఁ గైకొని పద్యంబుఁ జదువుకొని యయ్యర్థం బనే
కార్థంబులుగాఁ దోఁచినఁ గొంతతడ వాలోచించి యిట్లనియె.

క. ఓరి దురాత్మక ! యిఁక పలు
మారిటు రావలదు, హెచ్చి ♦ మరివచ్చితివా
నేరముగొందు గ్రహించుక
యూరక యాపని ఘటింపు ♦ మెప్పుడు నాకున్.

ఆ. అన నిరాశుఁ డగుచు ♦ నావీరసేనుండు
వచ్చి పలికె విప్ర ♦ వరునితోడ
నేమి వ్రాసినావొ ♦ యెఱుఁగ నింతైనను
మనసు గరుచదయ్యె ♦ మనుజపతికి.

మ. అని పల్కం దలఁచియూచి యూచి మది నా♦హా యంచు నేసాహసం
బునఁ జాతుర్య మెలర్పఁగాఁదనగతిన్ ♦ భూమీశు నుచ్ఛాయయుం
గని రెండొక్కటియైన మంచిదగుఁగా ♦ కా యంచు నిశ్శంకుఁడై
కని యూహించె శరప్రయోగమయి తా ♦ కం బద్య ముద్యద్గతిన్.

—♦ కవి రాజు కోపశాంతికరంబైన యొకపద్యము వ్రాసిపంపుట ♦—

చ. రవిజుఁడు భా గుణింప విధు ♦ రంబుగ భట్టి నశించె భారవి
ప్రవరుఁ డడంగె దీర్ఘమునఁ బ్రా ♦ ణముఁ బాసె గుడియ్య బిక్షుఁడీ
యవనికిఁ దప్పె భీముఁడు ద ♦ దంతగతి న్మతి కొమ్ము వెట్ట ని
ష్కృవముగ వే భుకుందుఁ డను ♦ కొమ్మున దీర్ఘము వెట్టకుండఁడీ
భువి నతఁ డెన్న నిర్దయుఁడు ♦ భూపతి నీవుఁ దలంప భూవరా.

వ. అని పద్యంబు లిఖియించి వీరసేనుని కిట్లనియె.

క. ఓపుణ్యాత్మక వినుమా !
యీపద్యముచే గ్రహించి • యెంతయుఁ జని నీ
వేపున నొసఁగిన వే యా
భూపతి నను బిల్వనంపుఁ • బొమ్ము రయమునన్.

వ. అని చెప్పిన నప్పద్యంబు గ్రహించుకొనిపోయి రాజు ముందరం బెట్టిన నప్పత్రిక దండధరాశిపుత్రికవిధంబున నుదికిం దోఁపఁ జూచి తదర్థంబు గ్రహించి నుపీవల్లభుండు పవనోత్కంపితకదళికామహీరుహంబు చందంబునఁ గంపితసర్వాంగయవుండై యెంతయుఁ బ్రొద్దు చింతించి తదభయదృఢతనస్నేహసారంబులును, దత్కవీయమహత్వంబును విచారించి వానితో నిట్లనియె.

—• రాజు కవిరాజుం బిలువఁబంపి పుత్రి నూఱడించుట •—

క. ఓవీరపుత్ర ! యిచటికి
వేవేగం బోడితెమ్ము • బిల్హణు ననినన్
భావమున రంజిల వాఁడు ధ
రావిభునకు మ్రొక్కి వచ్చి • రాసుత కనియెన్.

క. ఓతల్లి ! నీమనోహరు
నాతతవస్త్రదయాంతరంగుఁ • డై వసుధీశుం
డీతఱిఁ బోడుకరమ్మనె
నీతాపము మానుమింక • నీరజనయనా !

వ. అనిన విని గ్రీష్మసమయధందహ్యమానమానసయై మయూరిక ఘనాఘనగర్జానినాదంబు వినినచందంబున సుందరీమణి తద్వచనంబులు విని కుతూహలచిత్తయై కంఠహారం బొసంగిన గ్రహించుకొని బిల్హణున కిట్లనియె.

ఉ. ఓకవిరాజశేఖర ! మ • హోన్నతి నీవు రచించుపద్యముం
దేకువతోడ నానరవ • తిం గని యిచ్చినఁ జూచి యెంతయుం
గైకొని దాని యర్థమును • గాంచి దలిర్పగ్రహించి యప్పుడు
స్తోకవచంబునీటి నినుఁ • దోడ్కొనిరమ్మనె నయ్యెలిమ్యోడక్.

వ. అని యత్యాదరంబున శుభలక్షణప్రశస్తంబగు నతని హస్తంబు బట్టి
కొని వచ్చునెడ.

తే. రాజరాజగు మదనాభి ♦ రామనృపతి
తనకుమారినిఁ దలఁచి యా ♦ స్థాన మెడలి
వచ్చి తద్వారమందున్న ♦ వనజపత్ర
నేత్రి దగ్గరఁజేరి క ♦ న్నీరుఁ దుడిచి.

ఉ. శిరము మూర్కొని చికురముల్ ♦ సిక్కువాపి
చక్కఁగానిడి గద్గద ♦ స్వరముతోడ
ననిమె దయమీఱ భూపాలుఁ ♦ డాత్మజాత
కమ్మ! సంతాపమును మాను ♦ మమ్మ! యనుచు.

క. ఓకూర్మితనయ! కవివరు
నీకోరికమీఁదఁ గూర్తు ♦ నిశ్చలమతివై
నాకడకు రావమ్మా!
యీకడ నాచేయుపని గ్ర♦ హింపుము మదిలోన్.

—♦ రాజు కవివరు నెదురుఁగాజని తోడ్కొని వచ్చుట ♦—

వ. అని యుపలాలించి యంతఃపురంబున కనిచి బిల్హణకు నెదురుగాఁ
జని నమస్కరణపూర్వకంబుగఁ గౌఁగిలించి చతురంగయానంబున
నధివసింపంజేసి సభామంటపంబునకుం దోడ్కొనివచ్చి యుచితాస
నంబునం గూర్చుండ నియమించి సభాసదులు విన నృపవరుం డతని
కిట్లనియె.

ఉ. ఓచతురాననాన్వయమ ♦ హోదధిపూర్ణశశాంక! బిల్హణా
ఖ్యా! చతురాస్య! నీమహిమఁ ♦ గన్గొన నేరికి శక్యమౌ ధరన్?
నీచతురోక్తివై ఖరికి ♦ నీదృఢవృత్తికి, నీకవిత్వధా
రాచలితైకనిష్ఠకు న ♦ హర్నిశముక్ మది నేను మెచ్చితిన్.

—♦ రాజు కవివరు నూఱడించి తనకూఁతుం బెండ్లిగమ్మనుట ♦—

చ. తడఁబడి యెవ్వఁడేనియుఁ గ్ర ♦ తఘ్నునియం దొనరించుమేలుకై
వడిని మదీయకృత్రిమము ♦ భవ్యగుణాకర ! నీమనంబునం
దడవక సుందరీమణివ ♦ తంసము నాతనయన్ వరించి యే
ర్పడ నయ మొప్ప మత్సుతకు ♦ భర్తవుఁ గమ్మని పల్కె వెండియున్.

క. రేపు సమస్తంబగుఁగా
నీప్రొద్దున్ బడలినావు ♦ హితమతితో నీ
వీపట్ల నేడ సేఁయుము
భూపాలసుతైకచర్య ♦ భూసురవర్యా !

వ. అని యొడంబఱచి కవివరుని యథాస్థానంబున కనిచి వసంతాఖ్యున
కిట్లనియె.

క. ఓమంత్రివర్య ! చూచితె
భూమీసురచిత్తవృత్తి ♦ బోధింపంగా
నేమందు, నెంతదృఢ మా
భామామణిహృదయ మట్ల ♦ పరిశీలింపన్ ?

క. ఈవిధమున నిర్వురకున్
దైవాజ్ఞన్ ఘటనమయ్యెఁ ♦ దప్పింపంగా
నావశమె ? యగ్రజన్ముఁడు
భావింపఁగఁ గూఁతు నిత్తు ♦ భవ్యవిచారా !

వ. అనిన విని మంత్రివరుండును సభాసదులును నేతత్కార్యంబు విశేష
కార్యం బనిన విని వారలం బనిచి యంతఃపురంబునఁ బ్రవేశించి పరి
చారికాజనంబులం బిలిపించి యిట్లనియె.

క. ఓ కాంతలార ! మత్సుత
కాకవివర్యునకు భోజ ♦ నాదులు పూర్వం
బేకాలఁది విచారించితి
రాకాలఁదిం జేయుఁ డనుచు ♦ ననిచి రయమునన్.

వ. తనదార యగు మందారమాలిక కాచందంబంతయుం జెప్పి సూయమ కానందం బాపాదించి భోజనాదికృత్యంబులు దీర్చి సుఖంబుండునంత.

—♦ ప్రాతఃకాలాభివర్ణనము. ♦—

చ. తెలతెలవాఱెం దూర్పు, నలు ♦ దిక్కులఁ విచ్చెం దమంబు పక్షులుం
గలకలఁ బల్కెఁ, గోకములు ♦ గాంచె ముదంబు, లుసుప్రజంబు ఖ
స్థలమున నాడకాడకను ♦ జాఱెఁ, బెలంగి పదాయుధంబు లు
గ్గలగతిఁ మోసె, వీచె వలి ♦ గాడ్పులు, భూజను లుల్లసిల్లఁగన్.

సీ. కోకాంగనాగణ ♦ శోకమారుతమిశ్ర
ఘనతరజ్వాలలం ♦ గందినాఁడొ
విరహాదున్నహావధూ ♦ విపులనిశ్వసనోష్ణ
గంధవాహములచేఁ ♦ గమలినాఁడొ
బాధితపద్మినీ ♦ పటలశుకసంప్రాప్త
ఘోరపాపంబునఁ ♦ గుందినాఁడొ
జనదూరితాప్రాప్త ♦ జార చోరవ్రాత
శాపంబులను గొంత ♦ సమసినాఁడొ

తే. యనఁగ దోషాకరుండు క ♦ ళానుభూతి
దొరఁగి వెన్నెలపులుఁగుల ♦ వొడరి యితఁడు
రేపు నేవేళ కొదవునో ♦ మాపనేమి
యనుచు నీక సారమంత కొ ♦ ల్లాడ నరిగె.

ఉ. వెన్నెలతీవలం దడఁగి ♦ వెల్వడి విస్ఫురసారసావళిం
గ్రన్నన సౌరభంబుఁగొని ♦ రాజిలు గంధసమీరణంబు ల
భ్యున్నతసౌధరాజములఁ ♦ బుష్పశరాసనకేళిఁ దేలి యుం
దున్న వధూశ్రమాంబుతతు ♦ లొప్పలుమీఱ హరించునొతయుక్.

మ. ముద మొప్పారఁగఁ బద్మినీమణులు మో ♦ ము ల్విప్పఁ జక్రంబు ల
భ్యుదయం బొందఁ బదాళులుక్ సరసవి ♦ స్ఫూర్తిం బ్రవర్తిల్ల నా
స్పదమై భాసిలు పుష్పదంతగజరా ♦ జం బెక్కి యుద్యద్దిగ్వాజుల్
ముది రంజిల్లఁగ సన్నుతింప వొలసెన్ ♦ మందానిలుం డత్తఱిన్.

మ. మలయాహార్యతటంబు డిగ్గి విలస ♦ న్మల్లీమతల్లీలతా
వళులం జిక్కి ప్రయాసత న్వెడలి దీ ♦ వ్యచ్ఛాంబుకాసారని
ర్మలతోయంబుల నీఁది పంకరుహసౌ ♦ రభ్యంబుఁ గొల్లాడి వ
ఝులనాదంబులతోఁ జరించు మరుదం , కూరంబు లవ్వేళలన్.

క. తనతమ్ముల వైభవమును
గొనెనఁట యొకరాజు వానిఁ ♦ గొట్టెద ననుచున్.
ఘనకోపుఁ డయ్యె ననఁగా
నినుఁ డతితేజం బెసంగ ♦ నేతెంచె నొగిన్.

మ. హరిచక్రంబు భరించు నుద్భటనిశా ♦ టాటోపమున్ మాన్పి యు
ద్ధురలీలాప్తి బుధాంతవర్తి యయి యొం ♦ తో బూర్వదేశంబు భా
సురమై యొప్పఁగ నిందునంద నిలిపెన్ ♦ స్తోత్రార్హుఁ జేయంచు శం
కరపద్మోద్భవులున్ భజింపఁ జెలగెన్ ♦ గాల్యోదితాచార్యుఁడై.

ఉ. అంగుగఁ గాలమ న్కరికి ♦ నావల నీవల వ్రేలు బంధురా
భంగురపాశము ల్నెలయు ♦ బంగరుపోసిన ఘంటలో యనన్
సంగతి మీఱఁ బ్రాక్పరమ ♦ శైలములం గనుపట్టె రక్తసా
రంగధరుల్ నిజోర్ధ్వరుచు ♦ లందము నొందఁగ నట్టివేకువన్.

క. హితవిబుధస్తుతిగోత్రా
హితకరుఁ డుదయించె గురుబు ♦ ధేశహితుండై
ధృతిపూర్వదేశముం గొని
క్రతువులు గోతలమునందుఁ ♦ గడు నొప్పారన్.

సీ. అతులద్విజాలోక ♦ నావహుండై త్రయీ
సుముఖుఁడై నట్టి తే ♦ జోమయుండు
కమలామనోహరా ♦ కారుఁడై శర్వరీ
చరుల నొంచిన చక్ర ♦ భరణశాలి
యఖిలలోకతమోప ♦ హరణ నైపుణవృత్తి
రాజిల్లునట్టి స ♦ ర్వజ్ఞవిభుఁడు

మిత్రుఁడై భువనప • విత్రకుండై తగ
ధర వెలిఁగించు స • న్మార్గవర్తి
తే. యాదిమూర్తి యనంగఁ బ • ద్మాక్షుఁ డనఁగ
నార్తితార్యుఁడనంగ ది • వైకవార్త్మ
వముల ద్విజరాజసంగతి • వసుమతీంద్ర
శేఖరారూఢతను రవి • చెలఁగె నెదుట.

తే. అలకుతమ్ముల నొకటి దా • నాత్మఁ దలఁచి
దిశలు చెలువొందఁ దమము భే • దించి తనదు
లోకబాంధవవిఖ్యాతి • లోకు లెన్నఁ
గరము వెలుఁగంగఁ బద్మినీ • కాంతుఁ డలరె.

క. ఉరుకువలయంబు బెగడఁగ
ఖరకరుఁడు జనించి రాఁగఁ • గలుఁగు సదాళిన్
వరుసఁగని రూపు మాపఁగ
నరిగెను ద్విజరాజు పశ్చి • మాంబుధి కడకున్.

చ. సమయకిరాతకుం డుదధి • జాడల వచ్చుచుఁ జేరి పూర్వది
గ్రమణికి విక్రయించు దయ • రాగపు వన్నెపటంబు లిచ్చి చూ
పె మదికి హర్షమైనయది • బేరములాడి నిబద్ధమైన ని
ష్కము నొకటిచ్చెనో యనఁగఁ • జాయలుదోఁపనినుండుఁజెల్వగున్.

తే. ఒక్కయినుఁ డంతకంతకు • నుక్కమిగుల
నొక్కరాజది జూడంగ • నోర్వలేక
డింది వెల్వెలనై యొక్క • దిక్కుసేరె
ననఁగ సూర్యుండు హెచ్చె, హి • మాంశుఁ డడఁగె.

చ. సమయవినోది మిన్ననెడి • చక్కని రంగమునందు సర్వది
గ్రమణులు చూడఁగా దృఢము • రక్తినిఁ జూప విధుం డనెండు స
ద్దము నొకకర్ణమం దునిచి • దాపలికర్ణమునందు హేమచ
క్రము వెడలంగఁ దీసె ననఁ • గా రవి దోఁచెఁ బ్రభాప్రభావుఁడై.

—॰ భూపాలుఁడు తనకూఁతును గవి కిచ్చి పెండ్లిసేయ సన్నాహము జేయుట. ॰—

వ. ఆసమయంబున మంగళతూర్యనాదంబులు వినుచు మేల్కని మదనాభిరామభూమిధవుండు స్నాన సంధ్యాద్యనుష్ఠానంబుల నిర్వర్తించి సముచితాలంకారుఁడై సభాస్థలంబునకు వచ్చి మంత్రి పురోహితామాత్యబంధు విద్వజ్జనంబుల రావించి, వారల నుచితాసనంబునఁ గూర్చుండ నియమించి సుప్రసన్నుండై యిట్లనియె.

క. ఘనులార బిల్హణాఖ్యున
కెనయఁగ మామకకుమారి • నిచ్చెద నని నే
మనమునఁ దలఁచితి నిపుడు ద
దనుకూలము బ్రహ్మ పూర్వ • మందె ఘటించెన్.

వ. అని యిట్లు పలికి వారల యనుమతంబున ముహూర్తము నిశ్చయంబు సేయఁదలంచి జ్యోతిశ్శాస్త్రకోవిదులఁ బిలిపించి యడిగిన వారలిట్లనిరి.

క. గురుకవియుక్తినినుండున్
వరుస నమందాత్ముఁ డగుచు • వసుధఁ బరఁగినం
బరికింపఁగ ద్విజరాజును
చిరతరముగ మంగళాప్తి • చెన్నగువేడ్కన్.

తే. నీకుమారిక యళియయ్యె • నాకవీంద్రుఁ
డలర ధనువయ్యె నిర్వుర • కనుగుణంబు
గ్రహవిరోధంబు నెందులఁ • గానఁబడదు
రాజబల మొప్పు నొప్పు తా • రాబలంబు.

క. ఈకన్య కిపుడు ద్విజరా
జాకడ నాఁటింటఁ జెల్వ • మలరినవాఁడై
చేకొని పదిఁటను మిత్రత
శ్రీకరముగ నెప్పు నతను • సిద్ధి నృపాలా.

వ. అని యిట్లు పలికిన సంతుష్టాంతరంగుఁడై నృపపుంగవుండు నిజనగరం బలంకరింపఁ జేయుండని పరిచారకులం బంచిన.

సీ. పచ్చులతోరణ ♦ పంక్తులు ఘటియించి
కస్తూరిపూఁతలు ♦ గా నొనర్చి
మలయజపంకంబుఁ ♦ జిలికి జవ్వాదిరే
కులు దీర్చి రత్న వే ♦ దులు నమర్చి
ముత్యాలనవరంగ ♦ ములరంగు గావించి
నవవజ్రమయసితా ♦ నములు నెఱపి
వాసితాగరుధూప ♦ వాసనల్ నిగుడించి
పగడాల మెఱయు చ ♦ ప్పరము లునిచి
తే. ప్రతిగృహంబుల భర్తకుం ♦ భములు నిలిపి
దర్పణంబుల ద్వారబం ♦ ధములు గూర్చి
ధవళసౌధాళిఁ జిత్రకే ♦ తనము లెత్తి
పురము శోభిల్లఁజేసి ర ♦ బ్బరముగాఁగ.

సీ. ఏవీథి జూచిన ♦ నింపుమై మంగళ
తూర్యనాదములు సం ♦ తోష మెసఁగ
నేచాయఁ జాంచిన ♦ హితముగాఁ జెవులకు
వీణారవంబులు ♦ వేడ్కసేయ
నేపట్టుఁ గనిన భే ♦ రీపటహాదికా
హాళమృదంగైక వా ♦ ద్యములు నెనయ
నేచోటు వీక్షింప ♦ వాచాచమత్కృతిఁ
బాటలు నాటలుఁ ♦ బరిఢవిల్ల
తే. నొప్పు నక్షత్రవల్లభా ♦ భ్యుదయమునకుఁ
జెలఁగి యున్నంది యుబ్బిన ♦ జలధికరణి
దనరుఁ గవిరాజశేఖరమహో ♦ త్సవమునకును
నగరరాజంబు సంతతా ♦ నంద మొంద.

క. అత్తఱి నంగన లారతు
లెత్తఁగ ధవళములు వాడ ♦ నింపు గలిర్పం
గ్రొత్తగ గనుపింప బెండిలి
చిత్తరువునికె కరుదెంచె ♦ క్షితిసురు డేలమిన్.

సీ. ఈపద్మనిభపంశు ♦ కెనయంగ నలుగిడ
నేర్తువుపద్మిని ♦ నీవు రావె
యీశాంబుధిఁ జేరి ♦ యెలమి సేవలు సేయ
నేర్తువు మృడుహస్త ♦ నీవు రావె
యీ చతురాస్యుతో ♦ నింపుమై బలుకంగ
నేర్తువు శుభవాణి ♦ నీవు రావె
యీ మహాసర్వజ్ఞు ♦ కిరవొంద శిరసంట
నేర్తువు శశిరేఖ ♦ నీవు రావె

తే. యన చుం దమలోన భూమిపా ♦ లానుమతిని
సరసల్లాపవచనర ♦ చనలు దెలుప
నంగనారత్నములు గొంద ♦ ఱాసువర్ణ
గాత్రిఁ గదియుచు బాడిరి ♦ ఘనులు మెచ్చ.

క. మంగళము రాజసుతునకు
మంగళమంబుజముఖీ ర ♦ మాతనయునకున్
దుంగళము శాస్త్రవేదికి
మంగళము కవీంద్రమాళి ♦ మణికి సుగుణికిన్.

వ. అనుచు నారతిపాటలు పాడి శిరంబున నక్షతలునిచ్చి,

చ. నడుమసియాడఁ జన్నుఁగవ ♦ నాట్యము సల్పగ రత్నహారముల్
దడఁబడి డోలికాకళలన ♦ దార్కొన వేణి చలింప నెమ్మొగం
బాడుచు జెక్కుటద్దములు ♦ నొయ్య జెమర్పఁగఁ గంకణంబు లే
ర్పడి రవ ముప్పతిల్ల నొక ♦ భామ తలంబ్రఁ గవీంద్రమాళికిన్.

తే. గందమటకలితల బులి ♦ మందమైన
బంగరుకటాహములోనఁ ♦ బొంగుజలము
బొట్లుగాపించి బిందియ ♦ ల్పట్టి యొక్క
యతివ సుకవికి మజ్జనం ♦ బొర్చె నపుడు.

సీ. తడియార్చి వలువ లే ♦ ర్పడ నిచ్చె నొకలేమ
యుదుట పావా లుంచె ♦ నొక్కభామ
పువ్వులు సిగఁ జుట్టెఁ ♦ బొలుపొంద నొకకొమ్మ
మురువులు నిడె నొక్క ♦ ముద్దుగుమ్మ
కస్తూరితిలకంబు ♦ ఘటియించె నొకజాణ
యొడలు గంధములందె ♦ నొక్కచాన
చొకట్టుపోగులు ♦ సవరించె నొకబాల
యురుహారసులు బూన్చె ♦ నొక్కగోల

తే. పడతి రత్నపుటుంగరాల్ ♦ దొడిగె నొకతె
వెలది కపురంపుసురటిచే ♦ విసరె నొకతె
నిలువుటద్దంబు ముందర ♦ నిలిపె నొక్క
మగువ బిల్హణకవిశిఖా ♦ మణికి నపుడు.

క. ఈరీతిఁ గవినిఁ జెలు విం
పారగ గయిసేసి నృపవ ♦ రాత్మజ కెంతో
నీరాట మొనర్చియు శ్రృం
గారించిరి వేడ్కఁబోడమ ♦ గ్రక్కున నంతన్.

క. సరిగంచుచీర కటి పై
నెరయంగాఁ గట్టి తైక ♦ సీతై మెఱయన్
సరిగుబ్బలు గుబ్బతిలం
గరముగ సవరించుటపైఁట ♦ గావించి రొగిన్.

క. సికఁ జిక్కవార సేయని
చికురంబులు చిక్కుదీర్ప ♦ చెలువుగఁ గీల్గం

టొక యింతి వెట్టె నవ్వుచు
సకిముడి బాగుపడె ననుచు • సన్నుతిచేసెన్.

తే. సూర్యచంద్రులు మైత్రిచే • సుదతివదన
వనజమంతయు సంతత • వైభవంబు
నందఁజేయ వసించిరో • యనఁగ నపుడు
సూర్యచంద్రుల నిడె నొక్క • శోభనాంగి.

ఉ. కోరిక నాకలింగొని చ • కోరికలుర్ జవ ముప్పతిల్లఁగా
సారసవైరియం దమృత • సారము దూఱుచుఁ దోచె తద్గతం
బై రహిమించు నల్పుగొన • నత్తఱిఁ జాఱె ననంగ నొక్క సిం
గారపుబొమ్మ వాలుదెలి • కన్నులఁ గాటుకదీర్చె బోఁటికిన్.

తే. తారకావళిసేవ్యమై • తనరునట్టి
చంద్రబింబంబుతోడుత • సాటిసేయుఁ
జెలువమోమునఁ గస్తూరి • తిలక ముంచి
ముత్తెములపేరు లమరించె • ముదితయొకతె.

క. అద్దములవంటి చెక్కుల
నిద్దపురుచు లుప్పతిల్ల • నీటుగ శ్రుతులన్
ముద్దులగుమ్మకు నొక్కతె
ముద్దియ కుండలము లునిచె • ముద్దులుగారన్.

క. నంగతిగ మోవి చవిఁజూ
డం గని యరుదెంచె ననఁగఁ • దారొక్క నునాసన్
రంగలర నాణిముత్తెపు
ముంగరఁ గీలించె నొకతె • ముదితామణికిన్.

క. దరము వివరం బెఱింగియు
వరునం దనజన్మసీమ • వారిని వేడ్కన్

భరియించె నసఁగ నొక్కతె
యురుకుచ మెడ ముత్తెసరులు ♦ నునిచెం బ్రేమన్.

క. స్ఫుటముగ నీయుత్సవమునఁ
గటకంబులు మ్రోసె ననుచు ♦ ఘనమణిభాస్వ
త్కటకమ్ము లునిచె నొక్కతె
కుటిలాలకకరములందుఁ ♦ గోమరు సెలంగన్.

క. పిఱుఁదులు ధరగొని దీవులు
నిరవొందఁగ న్నాక్రమించి ♦ యేర్పడె ననుచున్
బిరుదుంచినగతి నొక్కతె
మెఱయఁగ రత్నముల కాంచి ♦ యునిచెం జెలికిన్.

క. కరిగమననడలు మదనుని
కరిగతులన్ ధిక్కరింపఁ ♦ గలవని యందెల్
సరిమ్రోయఁగఁ జరణంబుల
నరుదారఁగ నిలిపె నొక్క ♦ యతివ ముదమునన్.

క. ఈవిధమున రమణీమణు
లావసుధావరునిపుత్రి ♦ కంచితలీలన్
వేవేగ నలంకారము
గావించి వివాహవేది కడ నిల్పుటయున్.

సీ. సతివీక్షణములు ర ♦ సప్రవర్తకములై
నెమ్మోముదమ్మిపైఁ గ్రమ్మికొనఁగ
బిసరుహేక్షణదృష్టు ♦ లును మనోహరములై
గళసుగంధివిశేష ♦ కలనఁ బొదలఁ
దరుణాంగిచూపు ల ♦ త్తతి శిలీముఖములై
హృదయపంకజ మాన ♦ హించి నాట

భామినీలోచన ♦ ప్రభలు వరాళులై
తనరారు పాద ♦ పద్మముల ప్రాలఁ

తే. బరఁగి కవిరాజు పూర్వ ♦ వైఖరిని మోహ
కలితవిభ్రమవిస్మయా క్రాంతుఁ డగుచు
ననితరాయత్తచిత్తుఁడై యాత్మలోనఁ
జెలువభావంబు గాంచి వీ ♦ క్షింపుచుండె.

సీ. ఈశ్వరమంగళ ♦ యీక్షణకాంతుని
భరితసుధాకర ♦ ప్రభలుగాఁగ
నీశ్యామ కన్దోయి ♦ నింపాఱు దీప్తులు
పూసిన రతికాంతు ♦ భూతిగాఁగ
నీసతి కన్నుఁగొ భాసిలు దీధితుల్
పొలుపొందఁ దమ్ముల ♦ పూజగాఁగ
నీయార్యలోచన ♦ చాయలు మౌళిపైఁ
బ్రవహించు గంగాఝ ♦ రంబుగాఁగఁ

తే. బరఁగు కవిరాజమౌళి స ♦ ర్వజ్ఞమూర్తి
విలసదసమాంకవిస్ఫూర్తి విశదకీర్తి
యంచియచలభోగభా ♦ గ్యైకమూర్తి
యనుచు నచ్చటి విబుధాళి ♦ యభినుతింప.

సీ. భావిఫలోదయ ♦ ప్రాప్తభాసురములై
పరగు మౌక్తికముల ♦ బారు లనఁగ
రతిపంచశరులు సం ♦ తతకేళిఁదేలుచుఁ
బనివడి యాడువూ ♦ బంతు లనఁగఁ
దివ్యవిల్లోఁడు రెండు ♦ తెరఁగులై యిరువుర
కడలంది యేయు మా ♦ ర్గణము లనఁగఁ

డినవలనను వీరు ♦ దనరారిరనుచుఁ జం
ద్రుఁడుఁ జల్లు నమృతబిం ♦ దువు లనంగఁ

తే. వెలఁగు నయ్యామినపూర్ణ ♦ తిలక బిల్హ
ణాఖ్యకవివర్యుచూపు ల ♦ న్యోన్యమైత్రి
నొలయుచు గతాగతంబులై ♦ కలయ నలరి,
వెలయఁజూచిన జనులకు ♦ వేడుకయ్యె.

తే. బలితముగ విప్రులు 'తదేవ ♦ లగ్న' మనుచు
మంత్రములుపాడ శుభవీధి ♦ మహితలీల
వరుసనుంచిరి యవ్వధూ ♦ వరుల నృపతి
యనుమతంబున నైదువు ♦ లపుడు వేడ్క.

తే. పుడమివేల్పులు పుణ్యాహ ♦ పూర్వకముగ
దేవతాహ్వాన మొనరించి ♦ తివిరి వారి
కరములను గంకణములు వే ♦ డ్కను ఘటించి
చదివి రెంతయు మంగళా ♦ ష్టకము లపుడు.

మ. పొలుపొందన్ ద్విజరాజశేఖరునకున్ ♦ భూభృద్వతంసంబు ని
శ్చలబావోన్నతిఁ గన్యనిచ్చు పగిదిన్ ♦ కాశ్మీరదేశముఖ్యంబుగాఁ
బొలుపొందన్ ద్విజరాజశేఖరునకున్ ♦ భూభృద్వతంసంబు ని
శ్చలభావోన్నతిఁ గన్యనిచ్చె సుమన ♦ స్సంతానముల్ మెచ్చఁగన్.

క. తలఁబ్రాల వళ్ళెరంబులు
వెలఁదులు పార్శ్వములఁ బూన ♦ విభునిశిరమునన్
జలజాక్షి మంచిదోయిటఁ
దలఁబ్రాలును బోసె విభుఁడుఁ ♦ దనపై నించెన్.

వ. ఇట్లన్యోన్యాతిశయంబునఁ దమత్సవంబు గావించి విధ్యుక్తప్రకారం
బుగఁ బ్రధానహోమంబులాదిగాఁగలవి యాచరించి బంధుసహితం

బుగా భోజనాదికృత్యంబులు నెఱపి శేషహోమాదికృత్యంబు లను వర్తించి భూసురులకు మ్రొక్కి తదాశీర్వచనంబులు గైకొని బిల్హణుం డును యామినీపూర్ణతిలకయును యథేష్టభోగంబు లనుభవించు నెడ.

సీ. నీలమేఘంబులు ♦ శైలాగ్రములఁ బ్రాలెఁ
బరికింప వెన్నెల ♦ బారె విధుఁడు
సన్నగించెను పిక ♦ స్వరము లంతంతకుఁ
గలహంసలును దమ ♦ గతులు దప్పె
గగనమార్గము సావ ♦ కాశమై పొలుపొందె
నహిరాజు యూఢియం ♦ దంద నిలిచెఁ
గేతకీదళములు ♦ గెలఁకుల భాసిల్లె
మెఱపుఁదీఁగెలు మింటఁ ♦ దఱచు మెఱసె

తే. నంద మొప్పఁగఁ గొలఁకుల ♦ నందు వోడమె
నాడ కాడకుఁ గోరిక ♦ లతిశయిల్లె
ననుచు జనులెల్లఁ బొగడ ఘ ♦ నాగమమున
గర్భగౌరవ మాకాంత ♦ కాంచె నంత.

వ. ఇట్లు నవమాసంబులు నిండి దశమంబగుమాసంబునం దొక్కసుము హూర్తంబున.

మ. మరుదంకూరము సంచరింప గ్రహముల్ ♦ మార్తాండసంయుక్తి చే
నరయన్ దిక్కులు దెల్పఁ జెంద గరిమన్ ♦ దివ్యన్మృదంగాదివా
ద్యరవంబుల్ సెలఁగన్ సురప్రతతి యు ♦ ద్యత్పుష్పవర్షంబు ల
త్తతి వర్షింప వధూటి కాంచెను సుతున్ ♦ ధైర్యైకభాగ్యోన్నతున్

క. ఘనతం బ్రభాకరోదయ
మున జనియించుటయు విప్ర ♦ ముఖ్యులు వేడ్కం
గని లగ్నగతిఁ బ్రభాకరుఁ
డనునామం బిడిరి బిల్హ ♦ ణాఖ్యుఁడు మెచ్చన్.

వ. అప్పుడు మదనాభిరామభూమీధవుండు విద్వజ్జనబంధుమిత్రపురోహితామాత్యసమక్షంబున నతనిం దనవంశకర్తగాఁ బరిగ్రహించి జాతకర్మాదులు నలిపి గోభూతిలహిరణ్యాదిషోడశదానంబులు చేసి భూసురాశీర్వచనంబు లంది,

క. ఘనుఁడు ప్రభాకరుఁ డంతన్
దినదినమును వృద్ధిఁబొంది ♦ దివ్యద్యుతుఁడై
కనువట్ట వానిఁ బట్టము
చనువొప్పఁగఁ గట్టి సుఖము ♦ జయముం గాంచెన్.

మాలిని. ప్రథితగుణకలాపా ♦ భంజితేనప్రచాపా
ప్రధనవిజయకోపా ♦ భానుకోటిప్రతాపా
మథితదనుజదీపా ♦ మన్మథాచ్ఛస్వరూపా
మధురతరకలాపా ♦ మాన్యరామావనీపా.

శ్రీకృష్ణార్పణమస్తు.

